ఈ పదాలు ఎవరికోసం
ఉద్దేశించబడ్డాయో
వారిని చేరతాయి - రూమీ

బొల్లోజు బాబా

# అనువాద కవిత్వం

## Table of Contents

# మనవి మాటలు

ఒక అనువాద కవిత

మట్టి ముద్దను పాత్రగా మలచు
దాని శూన్యతలోనే
దాని ఉపయోగం ఉంటుంది.
గుమ్మాలు, కిటికీలతో
గృహాన్ని నిర్మించు
దాని శూన్యతలోనే
దాని ఉపయోగం ఉంటుంది.
దేన్నో పొందుతూ ఉంటాం కానీ
దాని శూన్యతనే వాడుకుంటూ ఉంటాం.

మూలం: టావో టె షింగ్ (Mould Clay into a vessel)
SEPTEMBER 22, 2008

నేను మొదటిసారిగా సోషల్ మీడియాలో నా బ్లాగు ద్వారా పోస్ట్ చేసిన అనువాదమిది. ఆ తరువాత విశ్వకవి రవీంద్రుని స్ట్రే బర్డ్స్ అనువదించి స్వేచ్ఛావిహంగాలు పేరుతో పుస్తకరూపంలో వెలువరించాను. ఇదే కాలంలో రవీంద్రుని క్రిసెంట్ మూన్ ను, వివిధ సూఫీకవుల గీతాలను "ఎడారి అత్తరులు" పేరిటా, పాబ్లోనెరుడా "Twenty love poems and a song of despair" ను అనువదించి e-books [1]గా విడుదల చేసాను.

సప్తశతి గాథలు, కె.సచ్చిదానందన్ కవిత్వానువాదాలను పుస్తకరూపంలోకి తీసుకొచ్చే ఆలోచనలో ఉన్నాను.

ఇవి కాక ఈ పదమూడేళ్లలో చేసిన వివిధ భారతీయ, ప్రపంచకవుల కవితల అనువాదాలు అన్నింటినీ ఒకచోటికి చేర్చాలనే ప్రయత్నమిది. ఇవన్నీ నా వాల్ లేదా బ్లాగులో ప్రచురించినవే. భిన్నకాలాలకు, నేపథ్యాలకు చెందిన వివిధ కవుల కవిత్వం ఇది. వీటన్నింటిని ఏకబిగిన చదివినప్పుడు కవిత్వం ఒక్కటే అన్నింటినీ కలిపే అంతఃసూత్రంగా ఉందని అర్థమైంది.

కవిత్వాన్ని ఇష్టపడేవారికి తప్పక నచ్చుతుందనీ, నిరాశపరచదనీ భావిస్తాను.

భవదీయుడు
బొల్లోజు బాబా 22/5/2021

[1] వాటిని ఇక్కడనుంచి డౌన్ లోడ్ చేసుకొనవచ్చును https://archive.org/details/@bolloju_baba

## వసంతం

మనలో కాంతి నింపటానికి
పిట్ట వచ్చింది.
పిట్ట కువకువల్లోంచి నీరు పుట్టింది
నీటికి, కాంతికి మధ్య గాలి విచ్చుకొంది
అలా వసంతరుతువు ప్రారంభమైంది
తాను వయసుకు వచ్చానని
విత్తనం తెలుసుకొంది
పువ్వుల బొమ్మల్ని వేరు చిత్రిస్తుంది
చివరగా
పుప్పొడి కనులు తెరుచుకొన్నాయి.

ఇదంతా
పచ్చని కొమ్మపైన
ఓ చిన్నపిట్ట వాలటం వల్ల జరిగింది.

The Spring by Pablo Neruda
8 April, 2019

# ప్రముఖ హిందీకవి మంగలేష్ దబ్రాల్ కవిత్వానువాదాలు



1.

**ఈ శీతాకాలం**

పోయిన శీతాకాలం చాలా బాధపెట్టింది
దాన్ని తలచుకొంటేనే వణుకు వస్తోంది
గత శీతాకాలం అమ్మ వెళ్ళిపోయింది
ఒక ప్రేమలేఖ కనపడకుండాపోయింది
ఒక ఉద్యోగం పోయింది
ఆ రాత్రులు ఎక్కడెక్కడ తిరిగానో గుర్తే లేదు
నేను చేసిన ఫోన్ కాల్స్, నా ఆత్మశకలాలూ
నాపై కుప్పకూలాయి

గత ఏడాది వేసుకొన్న దుస్తుల మూటల్ని విప్పదీసాను
దుప్పట్లు, మఫ్లర్లు, మంకీ కేప్ లు
వాటికేసి అలా తేరిపార చూసాను
ఆ రోజులు ముగిసిపోయాయి
ఈ శీతాకాలం అంత కఠినంగా ఉండదు... నిజంగానే!

This winter by Mangalesh Dabral

2.

**తాత గారి ఫొటో**

మా తాతగారికి ఫొటోలు తీయించుకోవటం
పెద్దగా ఇష్టం ఉండేది కాదేమో లేదా టైమ్ చిక్కలేదో
ఒకే ఒక ఫొటో ఉంది ఆయనిది
నీళ్ళబరువుతో వేలాడే మబ్బులా
రంగువెలసిన గోడకి తగిలించి
మా తాతగారి గురించి మాకు తెలిసిందల్లా
ఆయన బిచ్చగాళ్ళకు దానాలు చేసేవాడని
రాత్రుళ్ళు నిద్రపట్టక అటూ ఇటూ దొర్లేవాడని
ఉదయం తన పక్కను చక్కగా సర్దుకొనేవాడనీ.. అంతే
నేను అప్పటికి చాలా చిన్నపిల్లాడ్ని
ఆయన అమాయికత్వం కానీ కోపం కానీ ఎప్పుడూ చూడలేదు
ఫొటోలు మనుషుల అంతరంగాల్ని ఎన్నటికీ చెప్పలేవు.

అమ్మ అంటూండేది
మేం నిద్రపోతున్నప్పుడు
రాత్రిపూట మమ్మల్ని చుట్టుముట్టే వింత వింత జీవుల్ని
మా తాత ఫొటోలో మెలకువుగా ఉండి కాపలా కాస్తాడని

నేను మా తాత అంత ఎత్తు అవ్వలేదు
అంత శాంతంగానూ, గంభీరంగాను కూడా
కానీ ఆయన లక్షణాలు నాలో ఏమూలో ఉన్నాయనే అనుకొంటాను
ఆ అమాయికత్వం, ఆ కోపం.
నేనూ తలదించుకొనే నడుస్తాను
ప్రతీరోజూ ఒక ఖాళీ ఫొటో ఫ్రేములో
నన్ను నేను చూసుకొంటూంటాను.

Grandfather's Photograph by Mangalesh Dabral
10 Dec, 2020

## Samih al-Qasim దుఃఖగీతాలు



Samih al-Qasim జోర్డాన్ లో జన్మించిన పాలస్తీనియన్ కవి. ఇతను అనేకసార్లు రాజకీయకారణాల వల్ల జైలు పాలయ్యాడు. ఇతర కవుల్లా ఇతను పాలస్తీనియాను విడిచిపెట్టి పోలేదు దానికి కారణం నా మాతృభూమిపై నా అనుబంధమే అని ప్రకటించుకొన్నాడు. తన జీవితంలో ఎక్కువకాలం గృహనిర్బంధంలోనే గడిపాడు "The only way I can assert my identity is by writing poetry" అనేది Samih al-Qasim కవిత్వ వస్తువు మరియు శిల్పము. Samih al-Qasim 2014 లో మరణించాడు. Samih al-Qasim కవితల అనువాదాలు.

1.

**Travel Tickets**

నన్ను చంపినరోజు
నా జేబులో Travel Tickets గమనిస్తావు నువ్వు
శాంతిలోకి
పంటపొలాలలోకి, వానలోకి
మనుషుల అంతరాత్మలలోకి
తీసుకెళ్ళే Travel Tickets
ప్రియమైన నా హంతకుడా
ఆ టికెట్లను వృథాచేయకు.
వాటిని వాడుకో.
దయచేసి ప్రయాణించు

2.

**Slit lips**

చనిపోయిన

ఒక కోకిల కథను

నేను నీకు చెప్పి ఉండేవాడిని.

వాళ్ళు నా నాలుకను

చీల్చి ఉండకపోతే

ఆ కథను నీకు......

3.

**Abandoning**

నేను చూసాను ఆమెను
నేను చూసాను ఆమెను కూడలిలో
నేను చూసాను కూడలిలో ఆమె రక్తంచిందించటం
నేను చూసాను కూడలిలో ఆమె నడవలేకపోవటం
నేను చూసాను కూడలిలో ఆమె చంపబడటం
నేను చూసాను... నేను చూసాను....

ఈమె సంరక్షకుడు ఎవరని అతను బిగ్గరగా అరచినప్పుడు
నాకు ఆమె పరిచయమే అనే విషయాన్ని చెప్పలేదు
ఆ కూడలిలో ఆమెనలా విడిచిపెట్టేశాను
ఆ కూడలిలో రక్తమడుగులో ఆమెనలా విడిచిపెట్టేసాను
ఆ కూడలిలో నడవలేకపోతున్న ఆమెనలా విడిచిపెట్టేసాను
ఆ కూడలిలో మృత్యువుకి ఆమెనలా విడిచిపెట్టేసాను
ఆమెనలా విడిచిపెట్టేసాను....

4.

End of **Discussion** with a Jailer

నా జైలుగది కిటికీలోంచి
నన్ను చూసి నవ్వే చెట్లు
నా ప్రజలతో నిండిన ఇంటికప్పులు
నాకోసం విలపిస్తూ ప్రార్థించే కిటికీలు కనిపిస్తాయి
నా ఇరుకైన గది తలుపురంధ్రంలోంచి
నీ విశాలమైన గది కూడా కనిపిస్తుంది.

5.

## Confession at Midday

ఒక చెట్టును నాటాను
దాని ఫలాల్ని తృణీకరించి
మానుని కలపగా వాడుకొన్నాను
కొమ్మలను వీణగా చేసి
గొప్ప రాగాల్ని పలికించాను

వీణ పగిలిపోయింది
రాగాలు ఆగిపోయాయి
ఫలాలు పోగొట్టుకొన్నాను
ఇప్పుడు చెట్టు కొరకు దుఃఖిస్తున్నాను.

## భారతదేశం నా మాతృభూమి – మీనా కందసామి



ఇంతటి విధ్వంసంలోకి మనల్ని నడిపించిన నియంతలా, మృత్యువు కూడా రకరకాల వేషాలు ధరించటం నేర్చుకొందీవేళ
బరువైన పూలదండలు లేవు, శవాల బొటనవేళ్ళను కలిపిముడివేసే వారు లేరు. బిగుసుకుపోయిన వాటి చేతులను దగ్గరకు చేర్చి సరిచేసేవారు లేరు. మృతుల దేహాలపై కొత్తదుస్తులను కప్పేవారు లేరు. ఫ్రీజరు బాక్సులు లేవు. సుగంధద్రవ్యాలను చల్లేవారు లేరు. ముక్కు, చెవుల రంధ్రాలలో దూది ఉండలు ఉంచి, నుదిటిపై రూపాయిబిళ్ళను పెట్టేవారు లేరు. దుఃఖితస్త్రీల రోదనలు లేవు. గుండెలుబాదుకొంటూ, దుస్తులు చింపుకొంటూ ఏడ్చేవారు లేరు. సందర్శకుల తాకిడిలేదు. గదిలోంచి అలలుఅలలుగా వెక్కివెక్కి విలపించే గొంతులు లేవు. స్త్రీలు, పిల్లలు శ్మశానానికి రాకూడదంటూ శాసించే పురుష స్వరాలు వినిపించవు. డొక్కలో మోచేతితో పొడిచి "తరువాత శవం లేచేది మీ ఇంట్లోనే" అని గుసగుసగా మాట్లాడేవారు లేరు. మద్యం లేదు. చావు బాజాలు లేవు. పాడెమోసేవారు లేరు. పాడే లేదు. నోట్లో బియ్యపు గింజలు పోసే వారులేరు. సామూహిక ఓదార్పులు లేవు. ఎడతెగని కన్నీళ్ళు లేవు.

ఉన్నదల్లా...... కనుచూపుమేర విస్తరించిన తెల్లని ప్లాస్టిక్ దుప్పటిలో చుట్టిన అనామక శవాల ప్రవాహం. అనుమతించబడిన ఒక ఒంటరి బంధువు తండ్లాట. వరుసలు వరుసలుగా పేర్చి అంటించిన చితులు. ఏ దుఃఖమూ లేని జ్వాలలు, బూడిద. కాలటానికి ఇష్టపడని కట్టెలను పైకి క్రిందకీ సర్దుతూ భయపెట్టే పొగల మధ్య తిరుగాడే శవదహన కార్మికులు.

అంతిమ యాత్రలో నిమజ్జనం చేయటానికి అస్థికలు లేవు, వీడ్కోలులు లేవు, చివరి పలుకులు లేవు.

మృతుల కొరకు విలపిస్తాం. మన జడత్వం పట్ల దుఃఖిస్తాం, "భారతదేశం నా మాతృభూమి" అని రోజూ గర్వంగా చెప్పుకొనే వాక్యానికి లోగొంతుకతో "నా మాతృభూమి ఒక శ్మశాన వాటిక" అనే మాటల్ని జోడించుకొని శోకిస్తాం.

.

India is my country by Meena Kandasamy 26 April, 2021

## Mona Sa'udi కవిత్వం

.



Mona Sa'udi 1945 లో జోర్డాన్ లో జన్మించారు. కవయిత్రిగా, ఆధునిక శిల్పకారిణిగా ఈమె ప్రపంచవ్యాప్త గుర్తింపు పొందారు. Darwish, Adonis లు తనకు ప్రేరణ అనే ఈమె కవిత్వంలో దార్విష్ శైలి ప్రముఖంగా కనిపిస్తుంది. Ruya Ula (First Visions), In Times of War Children Testify ఈమె కవిత్వ సంపుటులు.

Mona Sa'udi కవిత్వంలో దుఃఖపు జీర, మిరిమిట్లు గొలిపే ప్రతీకలు ఆకర్షిస్తాయి.

★★★

1.

అంధనగరం
దాని వీధుల్లో నా చూపులు విస్తరిస్తాయి
వస్తువుల గందరగోళంలో
నిద్రలేమి పద్మవ్యూహంలో
నిశ్చల సముద్రం, కాలం
రాత్రి మృత్యువుల
నిశ్శబ్దపు స్వరాలు వింటాను.
దుఃఖించే పేవ్ మెంట్లతో
నన్ను నేను వెచ్చబరచుకొంటాను
అక్కడ చిన్న నీటిగుంటలో సైతం
కాంతి చిమ్మే జీవితం తళుక్కున మెరుస్తుంది.

2.

ఉప్పు స్పటికాల ఓడలపై
ఎడారులు నిండిన నిశీధి నగ్నత్వంపై
నక్షత్రాల త్రోవల్లో, గ్రహాల దారుల్లో
నా ప్రయాణం.
స్వప్నాల రేవులో నాకు నేను దొరుకుతాను
ఈ ప్రపంచం ఒక ఆటబొమ్మ స్థాయికి కుదించుకుపోయింది
అంధగాయకుడొకరు పాటఎత్తుకొంటాడు
రాత్రి చీకటిపై కాసేపు తచ్చాడుతాను
అంధులైన అందరితో ప్రేమలో పడతాను
ఈ రాత్రి నేను జన్మిస్తాను
ఈ రాత్రి నేను మరణిస్తాను
జీవించి ఉన్న అందరకూ అభినందనలు
మరణించినవారికి కూడా.

3.

శవపేటికలోని ఏకాంతం అంగడిలోని
అనామక వస్తువులపై కాసేపు వాలి
అంత్యక్రియల రోదనశబ్దాలుగా పైకి లేచింది.
నేను కన్నీళ్ళకన్నా ధృఢంగా మారతాను
కన్నీళ్ళు శిలారూపం పొందుతాయి
శిల, నేను నిలుపుకోలేకపోయిన ఓ స్నేహితుడు
సకల పరిమాణాలలో నేను విచ్ఛిన్నమౌతాను
హెచ్చవేయబడతాను
ద్రవంలా భిన్న ఆకారాలు పొందుతాను.

.

Mona Sa'udi poems

## ప్రముఖ పంజాబీ కవి శ్రీ సుర్జీత్ పతర్



శ్రీ సుర్జీత్ పతర్ ప్రముఖ పంజాబీ కవి. వీరు ఏడు కవితా సంపుటులను వెలువరించారు. అనేక యూరోపియన్ నాటకాలను, నెరుడా కవిత్వాన్ని పంజాబీ భాషలోకి అనువదించారు. ప్రతిష్టాత్మకమైన పద్మశ్రీ అవార్డు, సాహిత్య అకాడమీ అవార్డు, సరస్వతి సమ్మాన్ వంటి వివిధ పురస్కారాలను అందుకొన్నారు.

వీరి కవిత్వం సర్వమానవ సౌభ్రాతృత్వాన్ని కాంక్షిస్తుంది. ప్రాంతీయతా గోడలను దాటి విశ్వజనీన సత్యాలను ఆవిష్కరిస్తుంది.

కవి అనేవాడు సమకాలీన రాజకీయ, సామాజిక, ఆర్థిక పరిణామాలనుంచి తప్పించుకొని కవిత్వాన్ని సృజించలేడని శ్రీ సుర్జీత్ పతర్ విశ్వాసం. అందుకనే వీరి కవిత్వం కాలం అంచున నిలచి సమాజాన్ని ప్రతిబింబిస్తుంది.

పతర్ లేని పంజాబ్ సాహిత్యాన్ని, పంజాబ్ లేని పతర్ సాహిత్యాన్ని ఊహించటం కష్టమని వీరి విమర్శకులు అంటారు. శ్రీ సుర్జీత్ పతర్ వ్రాసిన కొన్ని కవితల అనువాదాలు------

★★★

1.

**అయిదు నదుల దేశం**

దుఃఖం
హింస
భయం
నిస్పృహ మరియు
అన్యాయం
నేడు ప్రవహిస్తూన్న అయిదు నదుల పేర్లు
ఒకప్పుడు అవి
సట్లెజ్
బీస్
రావి
జెలుమ్ మరియు
చెనాబ్

ఏదో ఒకనాటికి నా అయిదు నదులు
ఇలా ఉంటాయన్న ఆశ నాకు
సంగీతము
కవిత్వము
ప్రేమ
సౌందర్యము మరియు
న్యాయము.
(Eh ne Ajkal – 2014)

పంజాబ్ అంటే అయిదు నదుల సంగమ ప్రదేశం అని అర్థం. సుర్జీత్ పతర్ గారి ఈ కవితలోని మొదటి రెండు ఖండికలూ ఎవరైనా రాయగలిగేవే, కానీ మూడవ ఖండిక ద్వారా వీరి ప్రత్యేకత తెలుస్తుంది.

"వస్తువుల్ని వాటి మామూలు స్థానాలనుంచి తప్పించి వేరే వస్తువుల సరసన భిన్నస్థానాల్లో నిలిపితే మంచి కవిత్వమౌతుంది అంటారు. అలాగని పేలవమైన అస్పష్ట పదబంధాలు కవిత్వానికి శోభనివ్వవనే విషయాన్ని పై కవిత అద్భుతంగా వ్యక్తీకరిస్తుంది.

2.

**పదాలు చాలా తేలికైనవి**

పదాలు చాలా తేలికగా ఉంటాయి
ఎక్కడినుంచైనా తుంచి
ఎక్కడైనా అతికించవచ్చు
సముద్రం అనే పదాన్ని తీసుకొని
నవ్వు అనే పదం పక్కన చేర్చి
నవ్వే సముద్రాన్ని సృష్టించొచ్చు.
చెట్టు ని తీసుకొని
నడక కు అనుసంధానించి
నడిచేచెట్టు ని తయారు చెయ్యొచ్చు.
చాలా సులువు
రెండు పదాలను తీసుకొని జతచేసి
ఆకుపచ్చ సూర్యుడు
రక్తవర్ణ చంద్రుడు
ఎగిరే దీపాలు
పాడే తారలు అంటూ దేన్నైనా
రూపకల్పన చెయ్యొచ్చు.

తీసుకొని కలపటం సులభమే
కానీ దేన్ని తీసుకోవాలి
దేనితో కలపాలి అనేదే కష్టం
ఏ పదాన్ని ఏ పదం తో కలిపితే
శతాబ్దాలపాటు అలానే ఉంటాయో
తెలుసుకోవటం ఇంకా కష్టం

అలా కాకుంటే
వాస్తవమనే చిరుగాలి పడగొట్టవచ్చు
ఆకుపచ్చ సూర్యుడిని
రక్తవర్ణ చంద్రుడిని
పాడే తారల్ని
ఎందుకంటే
పదాలు బొత్తిగా బరువు లేనివి.

శ్రీ సుర్జీత్ పతర్ కవితలలో మొదటగా చదివింది ఈ క్రింది కవితని. ప్రతీకాత్మకంగా సాగే కవిత ఇది. గతంలో మనం చేసే ఒక పని (మాటలతోనో లేక మౌనంతోనో) యొక్క పర్యవసానమే ఆ తదనంతర పరిణామాలను ప్రభావితం చేస్తుందంటూ సాగే ఈ కవిత  బాగా నచ్చింది. మానవుడు చేసే ఏ క్రియా ఒంటరి కాదు కాల ప్రవాహంలో ప్రతీదీ ఒకదానితో ఒకటి ముడిపడి ఉన్నవే అంటుందీ కవిత. అద్భుతమైన అభివ్యక్తి కలిగిన కవితగా భావిస్తాను.

**ఆ దినం**

మరలా ఎపుడైనా
ఆ దినం నాకు కనిపిస్తే
గాయపడిన హంసలాంటి
దాని తెల్లని దేహానికి
కాస్త లేపనాన్ని పూస్తాను.

అనుకొంటాం కానీ
దినం అనేది తెగతెంపులు చేసుకొని
పారిపోయే రకంకాదు.
ఎక్కడెక్కడో తిరిగి తిరిగీ
ఏదో ఓ సాయింత్రం
చిరిగిన దుస్తుల్తో ఇల్లు చేరుతుంది
లేదా
ఏదో స్టేషన్లో ఏ రైలు కోసమో
ఎదురుచూస్తూ నీకు కనపడొచ్చు.

దినాలు ఎక్కడికీ పలాయనం చెందవు.
మనం మాటలతోనో లేక మౌనంతోనో చంపేసి,
వేటి గాయాల్నైతే మనమిపుడు ఏవిధంగానూ
నయం చేయలేమో ఆ ఒకనాటి దినాల దుఃఖించే ఆత్మలే
నేటి దినాలు.
నేటి దినం యొక్క రోదన
నిన్నటిని ఎన్నటికీ చేరలేదు
ఎన్ని శతాబ్దాలైనా సరే!
Oh Din ---1993

లియొనార్డ్ కొహెన్ అనే కెనడియన్ కవి “రెండు పద్యాలు” అనే ఒక కవితలో – మొదటి ఖండికలో రాజ్యహింసకు గురయిన ఒక వ్యక్తి పట్ల సానుభూతి చూపుతూ, అతనికి జరిగిన అన్యాయం పట్ల పగతీర్చుకొంటానని సూర్యకాంతిపై ప్రమాణం చేస్తాడు. రెండవ ఖండికలో అతని పేరు కవితలో ప్రస్తావించటం పట్ల అతని సలహా తీసుకొంటాననీ, ఆ ఉదంతాన్ని మర్చిపోతానని అదే సూర్యకాంతిపై ప్రమాణం చేస్తాడు.

నేడు ప్రపంచవ్యాప్తంగా నెలకొన్న ఒక భీతావహ వాతావరణం వల్ల, బుద్ధి జీవులు తమ తమ అభిప్రాయాలను స్వేచ్ఛగా వెలువరించలేకపోతున్నారనేది ఒక నిష్టుర సత్యం. అదే ఈ కవితా వస్తువు, ఒక గొప్ప శిల్పంతో...

4.

కవి గారు
వ్రాసిన మొదటి వాక్యాన్ని
పాలకుల తొత్తులకు భయపడి
కత్తిరించేసాను.
మరో వాక్యం వ్రాసి
ఉద్యమకారులకు భయపడి
కత్తిరించేసాను.

అలా
నా ప్రాణాలు నిలుపుకోవటానికై
అనేక వందల వాక్యాల్ని
వధించాను.

చంపబడ్డ నా వాక్యాలన్నీ
దెయ్యాలై నా చుట్టూ తిరుగుతూ
నన్ను ప్రశ్నిస్తున్నాయి
ఓ కవీ!
నువ్వు కవివేనా లేక
కవిత్వ కసాయివా?
Mr. Poet

5.

పరదేశం
రెండు మూడు
అడుగులు వేసేసరికి
విదేశీభూమిపై తేలాను
నేను నాటిన చెట్ల నీడలు
ఎంత కురచగా ఉన్నాయో!

The Alien Land

చిన్నదైనా, భిన్న అర్థాలను స్ఫురింపచేసే మంచి కవిత.

## సాహిత్య నోబెల్ విజేత Louise Glück కవిత్వం

.




1968లో Louise Glück ఇరవైదేండ్ల వయసులో Firstborn అనే కవిత్వసంపుటిని వెలువరించింది. ఆమె కవిత్వం ఆనాటి సమకాలీన-ఆధునిక సరిహద్దులను చెరిపేస్తూ, సరళమైన భాష, తక్షణ జీవితానుభవాలు, సార్వజనీన అప్పీల్, కథనాత్మక శైలి, ఐతిహ్యసంబంధ, మానవవిషాదం, కన్ఫెషనల్ ధోరణి లాంటి అంశాలతో అందరినీ ఆకట్టుకొంది. ఆమె కవిత్వం ఆ తరువాతి కాలంలో మరింత చిక్కబడింది.

Louise Glück కవిత్వాన్ని ఇరవయ్యోశతాబ్దపు సాహిత్యప్రపంచంలో ఎక్కడ పెట్టాలి అని విమర్శకులు తర్జనబర్జన పడ్డారు. సాహిత్యవిమర్శలో ఒక కవిస్థానాన్ని అకడమిక్ గా, కళాపరంగా, చారిత్రాత్మకంగా మూల్యాంకనం చేయటంలో — అస్తిత్వరాజకీయాలు, వివిధ భావవాద స్కూల్స్, ఉద్యమాలు, శిబిరాలు నిర్ణయాత్మకంగా ఉండేవి. కానీ ఈమె కవిత్వం అన్నిరకాల వాదాలలో, ఉద్యమనేపథ్యాలలో, శిబిరాలలో- పగుళ్ళలోకి పరుచుకొనే పాదరసంలా ఒదిగిపోవటమే దానికి కారణం

వైయక్తిక అనుభవాలను మాత్రమే చెప్పే కన్ఫెషనిస్టు కవిత్వ ధోరణిని, తమ వర్గ సంస్కృతిని మాత్రమే కవిత్వీకరించే అస్తిత్వవాద ధోరణిని సమ్మిళితం చేసి ఒక సార్వజనీన కవిత్వపాయను లూయిస్ గ్లగ్ నిర్మించుకొన్నదని విమర్శకులు నేడు గుర్తించారు.

లూయిస్ కవిత్వంలో కోర్కెలు, ఆశలు, ప్రేమ, గాయాలు, దుఃఖం, వేదన, జీవనకాంక్ష, వ్యాఖ్యానం, ఆత్మకథనాత్మకత, ప్రకృతి, కాలం, దైవీకదర్శనం లాంటివి పదే పదే వచ్చే థీమ్స్. ఈమె కవిత్వంలో Social Prophecy కన్న Spiritual Prophecy అధికం. ఇది సమకాలీన కవిత్వరీతులకు భిన్నమైన స్వరం.

లూయిస్ తనను ఒక జ్యూయిష్ అమెరికన్ కవిగానో, ఒక స్త్రీవాద కవిగానో, ఒక ప్రాకృతిక కవిగానో గుర్తింపబడటానికి ఇష్టపడలేదు. “in-betweenness” తన లక్షణమని చెప్పుకొన్నది.

తనకవిత్వంలోని అనుభవాలన్నీ తనలోపలి అనుభవాలే తప్ప వెలుపలి అనుభవాలు కాదని లూయిస్ ఒకచోట విస్పష్టంగా పేర్కొంది.

★★★

**Louise Glück** వ్రాసిన కొన్ని కవితలకు నేను చేసిన అనువాదాలివి.

.

Lost Love

నా సోదరి ఈ భూమిపై సంపూర్ణజీవితాన్ని జీవించింది
పుట్టింది, చనిపోయింది.
మధ్యలో
ఒక్క చూపు, ఒక్క వాక్యం ఇక్కడ విడిచివెళ్లలేదు
అందరు శిశువుల్లానే ఆమె కూడా ఏడ్చింది.
పాలు తాగ నిరాకరించింది
మా అమ్మ మొదట్లో తనబిడ్డ తలరాతను మార్చటానికి ప్రయత్నించింది
తరువాత చరిత్రను.

నా సోదరి చనిపోయాకా
మా అమ్మ హృదయం మెడకి వేలాడే ఇనుప బిళ్ళలా
చల్లగా గడ్డకట్టింది
నా సోదరిదేహం ఒక అయిస్కాంతంలా మారి
మా అమ్మ హృదయాన్ని భూమిలోకి లాక్కుని
అక్కడ దాన్ని తిరిగి మొలకెత్తించాలని యత్నించేదేమోనని
ఒక్కోసారి నాకు అనిపించేది.

పుట్టగానే చనిపోయిన తన సోదరిపై వ్రాసిన ఒక కవిత ఇది. చాలా సామాన్యమైన సంసారిక దుఃఖం ఇది. కానీ చెప్పనలవికాని మానవ వేదన. ఇది చావుని గ్లోరిఫై చేయటం కాదు. పురిట్లోనే బిడ్డను కోల్పోయిన తల్లి ఉద్వేగానికి ఇచ్చిన అక్షర రూపం. ఈ కవితలో “తరువాత చరిత్రను” అన్న రెండు పదాలలో– ఆ తల్లి జరిగిపోయిన విషయాన్ని తలచుకొని ఎంతెలా దుఃఖించిందో అంతటి పెనువేదనా ఇమిడిపోయింది.

**అర్ధరాత్రి – MIDNIGHT**

గాయపడ్డ హృదయమా! మాట్లాడు
ఎంత తెలివిమాలిన పనిచేస్తున్నావో నీకు అర్ధమౌతోందా
garage లో చెత్తమధ్య కూర్చొని ఏడుస్తూ ఉండటం.
అది నీపని కాదు. నీపని అంట్లుతోమటం
చిన్నతనంలో పెంకెతనం చూపినట్లుగానే ప్రవర్తిస్తున్నావు
నీ క్రీడా స్ఫూర్తి, ఉదాసీన వైఖరి ఎక్కడకు పోయాయి?

విరిగిన కిటికీ అద్దంపై వెన్నెల వాలింది
పలుచని వేసవి వెన్నెల
మెత్తని గుసగుసలతో భూమి తియ్యగా సిద్ధమైంది--
నీ భర్తతో సంభాషించే పద్ధతి ఇదా- ఫోన్ చేస్తే ఎత్తకపోవటం;
హృదయం గాయపడినప్పుడు garage లో ఒంటరిగా కూర్చోవటం?

నువ్వే నేనైతేనా... భవిష్యత్తు ఊహిస్తాను
మరో పదిహేనేళ్ళ తరువాత
ఏదో ఓ రాత్రి అతని గొంతుక అలసిపోతుంది;
నువ్వు ఫోన్ ఎత్తకపోతే, మరొకరు ఎవరో ఎత్తుతారు.

.

పై కవితలో లూయిస్ పలికించిన ఐరనీ అసమాన్యమైనది. కానీ ఇదే కఠినమైన జీవన వాస్తవికత. నీ పని అంట్లు తోమడం అనే వాక్యం ఈ కవిత మొత్తానికి గరిభనాభి లాంటిది. దాంపత్యజీవితంలో ఉండే ఇంటిమసీ ఒక నిషిద్ధ వస్తువు స్త్రీవాదానికి సంబంధించి. దాన్నీ లూయిస్ గమ్మత్తుగా ఉపయోగించుకొందీ కవితలో. “in-betweenness” అంటే ఇదేనేమో!

## Saints

మా కుటుంబంలో ఇద్దరు సన్యాసినులు ఉండేవారు
మా మేనత్త, అమ్మమ్మ
కానీ వారి జీవితాలు భిన్నమైనవి
మా అమ్మమ్మ చివరివరకూ ప్రశాంతంగానే ఉండింది.
నిశ్చలజలాలపై నడిచే వ్యక్తిలా అనిపించేది
కారణాలు తెలియవు కానీ
ఏనాడు ఏ సముద్రపు అలలూ ఆమెను తాకలేదు
మా మేనత్త కూడా అదే మార్గంలో నడిచింది కానీ
ఆమెపై కెరటాలు ఉవ్వెత్తున విరుచుకుపడేవి
గాయపరిచేవి.
ఆత్మసంభంద విషయాలకు
విధి ఒక్కోలా స్పందిస్తుంది కాబోలు

మా అమ్మమ్మ జాగ్రత్తపరురాలు, సంప్రదాయవాది
అందుకే బాధలను తప్పించుకొని ఉంటుంది.
మా మేనత్త అన్ని కష్టాలు ఎదుర్కొంది
ఒక్కో కెరటం వెనక్కు వెళుతూ వెళుతూ
ఆమె ప్రేమించే ఎవరినో ఒకరిని తీసుకొని పోయేది.
అయినప్పటికీ
ఆమె సముద్రాన్ని ఒక దుష్టశక్తిగా అనుకోదు.
ఆమెకు సముద్రం ఒక సముద్రం అంతే.
తీరాన్ని తాకినప్పుడల్లా విలయాన్ని సృష్టించితీరాల్సిందే.

.

పై కవిత చాలా ఆలోచనల్ని కలిగిస్తుంది. సంప్రదాయక విలువలు గొప్పవని చెపుతోందా కవయిత్రి ఇక్కడ; సముద్రం దేనికి ప్రతీక కాలానికా, ఆధునికతకా, స్త్రీజీవితంలో ఎదురయ్యే పురుషునికా; . ఆత్మసంభంద విషయాలు ఏమిటి? (Original-which is how Fates respond to a true spiritual nature). ఎన్నిరకాల భాష్యాలు చెప్పుకొన్నా ఈ కవితలోని స్వరం భిన్నమైనది. సమకాలీన ధోరణులకు వ్యతిరిక్తప్రవాహం వంటిది

.

**కలయిక** – The Encounter

నువ్వు మంచం వద్దకు వచ్చి కూర్చొని
నన్ను తేరిపారచూస్తూ
నా మొఖాన్ని చేతుల్లోకి తీసుకొని ముద్దాడతావు.
కరిగిన మైనం నుదిటిపై తెలుస్తుంది నాకు
అది అక్కడ ఒక మచ్చను మిగల్చాలి అని కోరుకొంటాను
నిన్ను ప్రేమించటం అంటే నాకంతే తెలుసు
ఎందుకంటే
దహింపబడి, ఏదో ముద్రవేయించుకొని
చివరలో దేన్నో పొందాలని వాంఛిస్తాను నేను...
నా దుస్తులు తొలగిస్తాను
నా చెక్కిళ్లపై ఎరుపుదనం
అలా నిప్పులదారిలో ప్రయాణించి
భృకుటిపై చల్లని నాణెమై కుదురుకొంటుంది.

అదే అనుభవాన్ని పొందిన నువ్వూ నా పక్కనే పడుకొని
నా ముఖాన్ని చేతులతో తడుముతావు
నేను నిన్ను ఎంతగా కోరుకొన్నానో
నీకూ అర్ధమౌతుంది
మనకు ప్రతీసారీ తెలుస్తూనే ఉంటుంది... నీకూ నాకూ
దీనికి సాక్ష్యం నా దేహమే.

.

తెలుగునాట ఇలాంటి మానవానుభవాల్ని వ్యక్తీకరించటాన్ని బూతుగా ముద్రలు వేసారు గత మూడు, నాలుగు దశాబ్దాలుగా. ఇలాంటి అభివ్యక్తులను తీరిక వర్గాల కవిత్వంగా, సామాజిక స్పృహలేని ఉత్త కాల్పనిక సాహిత్యంగా ఇంకొంచెం ముందుకు పోయి దోపిడీ వర్గాలకు దోహదపడే కవిత్వంగా తీర్మానాలు చేసారు చాలామంది విమర్శకులు.
మానవానుభవాల్ని వ్యక్తీకరించటమే కవిత్వ లక్ష్యంగా, ప్రయోజనంగా నేడు ప్రపంచం గుర్తించింది. in-betweenness, inclusivity, simplicity నేటి కవిత్వరీతి. తెలుగు కవులు ఈ bastion ను అందిపుచ్చుకొంటారా ఇంకా తాము గీసుకొన్న వృత్తాలలోనే ఉండిపోతారా అనేది కాలమే తేల్చాలి.

## రేపు నిన్ను ఎవరో అరెష్టు చేస్తారు - మీనా కందసామి

.

రేపు నిన్ను ఎవరో అరెష్టు చేస్తారు. నీ ఇంట్లో ఏదో సమస్యాత్మక పుస్తకం ఉందని ఆధారం చూపుతారు
రేపు నిన్ను ఎవరో అరెష్టు చేస్తారు. పోలీసులు చెప్పారని ప్రసారమాధ్యమాలన్నీ నిన్ను తీవ్రవాది అనటాన్ని నీ మిత్రులు టివిలో చూస్తారు.

రేపు నిన్ను ఎవరో అరెష్టు చేస్తారు. లాయర్లందరినీ భయపెడతారు. నీ కేసు తీసుకొన్న లాయర్ ఆ పైవారం అరెష్టు చేయబడతాడు
రేపు నిన్ను ఎవరో అరెష్టు చేస్తారు. ఆ మర్నాడు నిన్ను ఫేస్ బుక్ లో చూస్తారు నీ మిత్రులు. పోలీసులే నీ పేరుతో ప్రవేశిస్తారు
రేపు నిన్ను ఎవరో అరెష్టు చేస్తారు. పిటిషన్ పై వెయ్యి సంతకాలు తీసుకోవటానికి నాలుగురోజులు పడుతుంది నీ మిత్రులకు
రేపు నిన్ను ఎవరో అరెష్టు చేస్తారు. నీ చిట్టితల్లి UAPA అంటే ఏమిటో తెలుసుకొంటుంది. నీ మిత్రులకు సెక్షన్-13 అర్థమౌతుంది.
రేపు నిన్ను ఎవరో అరెష్టు చేస్తారు. ప్రజలకు నువ్వు ఒక లెఫ్టిస్ట్ వి, లెఫ్టిస్ట్ లకు నువ్వు ఒక అతి-లెఫ్టిస్ట్ వి. ఎవరూ మాట్లాడరు.
రేపు నిన్ను ఎవరో అరెష్టు చేస్తారు. ఇకపై జీవితాంతం నీవు తీవ్రవాదిగానే పరిగణించబడతావు.
రేపు నిన్ను ఎవరో అరెష్టు చేస్తారు. వాళ్ళు ఒక జాబితా తయారుచేస్తారు. ఖండించినవారి పేర్లు అందులోకి చేరుతూంటాయి.
రేపు నిన్ను ఎవరో అరెష్టు చేస్తారు. నిన్ను హెచ్చరిస్తారు. నీవే ప్రతిఒక్కరికీ ఒక హెచ్చరిక అవుతావు- కార్పొరేట్ సాలెగూటిలో వేలుపెట్టినందుకు.
రేపు నిన్ను ఎవరో అరెష్టు చేస్తారు. ఈ రాత్రి నీ ఇల్లు సోదాచేస్తారు. నిన్ను ప్రశ్నించటానికి తీసుకెళతారు. మాట్లాడకు.
రేపు నిన్ను ఎవరో అరెష్టు చేస్తారు. కోర్టు ఓ అరుదైన చర్యగా నీకు బెయిలిస్తుంది. మరో కేసులో నువ్వు మళ్ళా అరెష్టు చేయబడతావు
రేపు ఎవరో నీ పిల్లల్ని అరెష్టు చేస్తారు. నీవు అజ్ఞాతంలోకి వెళిపోతావు.
ప్రజాస్వామ్యాన్ని బతికించటానికి కొన్ని జాగ్రత్తలు తప్పవు.
నిశ్శబ్దమా వర్ధిల్లు!

.

మీనా కందసామి ( The End of Tomorrow)

ఆధునిక ప్రపంచంలో నువ్వెవరవో ఎవరికీ అక్కరలేదు. నువ్వేం చెపుతున్నావన్నదే ముఖ్యం. ఆ చెప్పేది "వారికి" ఏ మేరకు మేలుచేస్తుందన్న దానిబట్టే నీ మనుగడ, నీ భద్రజీవితం. ఇదొక అదృశ్య ఆధిపత్య పోరు.
ప్రముఖ కవయిత్రి, మీనా కందసామి వ్రాసిన ఈ కవిత ఈనాటి రాజకీయ సామాజిక వాస్తవికతకు అద్దంపడుతుంది. కేరళ ప్రభుత్వం చేపట్టిన భూసేకరణకు, అక్కడి వాసితులను బలవంతంగా తొలగించటానికి వ్యతిరేకంగా ప్రజాస్వామ్యయుతంగా పోరాడుతున్న ఇద్దరు యువకులను, జనవరి 2015 లో అరెస్టు చేసింది ప్రభుత్వం. అదీ ఈ కవితకు నేపథ్యం.
ఈ కవితలో 'నిన్ను' అన్న సంభోధనలోనే ఈ ప్రపంచంతో నీ మనుగడ ప్రశ్నార్ధకమైందన్న అంశం దాగిఉంది. ఆ 'నువ్వు' లో 'నేను' లేను అనుకోవటం మనల్ని మనం మోసగించుకోవటమే.

చివర్లో నిశ్శబ్దమా వర్ధిల్లు అనటం ఈ సమాజం ప్రదర్శిస్తున్న నిర్లిప్తతపై గొప్ప వ్యంగ్యం.

## రూమీ

ఒక మంచి పని చేసి
నదిలోకి విసిరేయ్
ఏదో ఒక రోజు ఎడారిలో
అది నీవద్దకు తిరిగి వస్తుంది

## అమెరికన్ అధోజగత్ జీవనానుభవాల కవి



Charles Bukowski అమెరికన్ కవి. (1920-1994) బుకోవ్ స్కీ కవిత్వం ముతకగా ఉంటుంది. ఇంతకు మించి కోల్పోవటానికి ఏమీ లేదు అనే అనుభూతిని, ఉద్వేగాన్నీ కలిగిస్తుంది. ఒకరకమైన సినికల్ ధోరణిగా అనిపిస్తుంది కూడా.
నాలుగురోజుల క్రితం మా అమ్మాయి బుకోవ్ స్కి గురించిన ఒక కొటేషన్ ను చూపించింది. ఒక వ్యక్తిత్వ వికాస పుస్తకంలోని ప్రారంభ వాక్యాలట అవి.

"Charles Bukowski was an alcoholic, a womanizer, a chronic gambler, a lout, a deadbeat and on his worst days, a poet. He is probably the last person on earth you would ever look to for life advice"

ఇతన్ని నువ్వు చదివావా అని అడిగింది. కొన్ని అనువాదాలు కూడా చేసాను అన్నాను తను ఏమనుకొంటాదో అని భయపడుతూ (ఆ కొటేషన్ మేటర్ అలాంటిది మరి )

ఈ రోజు బాల సుధాకర్ మౌళితో మాట్లాడుతున్నప్పుడు బుకోవ్ స్కి ప్రస్తావనవచ్చింది. నేను చేసిన అనువాదాలను ఒక సారి చూసుకొన్నాను. అయిదేళ్ళుగా బుకోవ్ స్కీతో ప్రేమలో ఉన్నానని అర్ధమైంది.
అవన్నీ చూసి.... ఎందుకు అనువదించానో నన్ను నేను ఒకసారి తరచిచూసుకొనే ప్రయత్నమిది.

**I Met A Genius**– Charles Bukowski

ఈరోజు రైల్లో
నేనో మేధావిని కలిసాను
ఆరేళ్ళ వయసుంటుందేమో
అతను నా పక్కనే కూర్చున్నాడు

రైలు సముద్రతీరం వెంబడి వెళుతోంది
సముద్రాన్ని చూస్తూ అన్నాడతను
"పెద్ద అందంగా ఏం లేదని"

అవును నిజమే కదా అనిపించింది
మొదటిసారిగా
1 October 2015

అనాదిగా సముద్రపు అందాల్ని వర్ణిస్తూ అనంతమైన సాహిత్యం వచ్చి ఉంటుంది. అదేదీ తెలియని ఒక చిన్నపిల్లవాడు సముద్రం పెద్ద అందంగా ఏం లేదు అన్నప్పుడు అతడిని మేధావిగా వర్ణించటం ద్వారా పాతతరం కవుల్నందరినీ దోషులుగా నిలబెడతాడు బుకోవ్ స్కి. అదే అర్థం వచ్చేలా Great art is horseshit అంటాడు మరోచోట.

**ఈ రాత్రికి** ----- Tonight by Charles Bukowski

“నీ ప్రియురాళ్ళపై నీవు వ్రాసే కవిత్వం
మరో యాభై ఏళ్ళు నిలుస్తుంది.....
వాళ్ళు గతించిపోయినప్పటికీ”
నా ఎడిటర్ ఫోన్ చేసి అంటున్నాడు.
మిత్రమా
వారేనాడో నన్ను విడిచి వెళ్ళిపోయారు
నువ్వేమంటున్నావో నాకు అర్ధమైంది.
ఐతే
ఒక్క నిజమైన సజీవ స్త్రీని నాకొరకు ఈ రాత్రికి పంపించు
నా వైపు నడుచుకొంటూ వచ్చే ఒక్క స్త్రీని...
నా కవితలన్నీ నీకిచ్చేస్తాను
మంచివీ, ముతకవీ
ఇకపై నేను వ్రాయబోయేవీ కూడా.

నువ్వేమంటున్నావో నాకు అర్ధమైంది.
నేనేమంటున్నానో నీకు అర్ధమైందా?
13 March 2016

ప్రేమ కవిత్వం అంతా విరహంలో పుడుతుందన్న సూచన, లేనిదాని కొరకు చేసే అన్వేషణే సాహిత్యం అన్న అర్ధాలు పై కవితలో కనిపించాయి. బహుశా బాలగోపాల్ అన్న "ఖాళీలను పూరించటమే సాహిత్యం చేసే పని" అనే వాక్యం పై కవితకు అన్వయించుకోవచ్చనుకొంటాను.

**కొద్దిసేపటి క్రితమే** -- it was just a little while ago

తెల్లారింది
టెలిఫోను తీగలపై పిట్టలు
ఎదురుచూస్తుండగా
నిన్న మరచిపోయిన సాండ్విచ్ ను
ఇప్పుడు తింటున్నాను.

ప్రశాంతమైన ఆదివారపు ఉదయం
గది మూలన నిల్చుని ఉంది ఒక చెప్పు
మరొకటి దానిపక్కనే
అవును
కొన్ని జీవితాలు వృధా కావటానికే
సృజింపబడతాయి.

20 November 2016

ఒక మెలంకలీ పరుచుకొన్న కవిత ఇది. దృశ్యాలు, సంఘటనల ద్వారా బాధను ఎంత బలంగా చెప్పొచ్చో తెలియచేస్తుంది.

## రూములు రెంట్ కి ఇచ్చే అందమైన అమ్మాయి

న్యూ ఓర్లియాన్స్ నగరంలో అద్దెకు గది చూపించింది
ఓ అందమైన అమ్మాయి.
చీకటిగా ఉందాచోటు
చాలా దగ్గరగా నిలుచున్నాం మేం
"ఈ గదికి వారానికి నాలుగున్నర డాలర్ల అద్దె" అందామె
"నేను సాధారణంగా మూడున్నర చెల్లిస్తూంటాను" అన్నాను
ఆమెను అప్పుడప్పుడూ చూస్తుండొచ్చుకదా అని
నాలుగున్నర చెల్లించటానికి నిర్ణయించుకొన్నాను

ఆ అమ్మాయి లాగే
స్త్రీలు ముందుగా తాము చొరవచూపరెందుకో అర్ధంకాదు
మననుంచి ఆశిస్తారు
చివరకు నేనే "రూము తీసుకొంటాను" అని చెప్పి డబ్బులు చెల్లించాను
దుప్పట్లు మురికిగా ఉన్నా, మంచం సర్ది లేనప్పటికీ

నేను అస్కలిత యవ్వనస్తుడను
కంగారులో ఉన్నాను కూడా
డబ్బులు తీసుకొని
తలుపు వేసి వెళిపోయిందామె.

రూములో టాయిలెట్ లేదు
సింకు లేదు, కిటికీ కూడా లేదు
రూమంతా ఆత్మహత్య, మృత్యువులతో తడితడిగా ఉంది
మంచంపై పడుకొన్నాను
అక్కడొక వారం ఉన్నాను
హాల్ లో చాలామందిని కలిసాను
ముసలి తాగుబోతుల్ని
ఉపశమనం పొందుతున్నవారిని
పిచ్చివాళ్లని
చురుకైన పడుచువాళ్లను
జబ్బైన వృద్ధులను
కానీ

ఆ అమ్మాయిని మాత్రం మరలా చూడలేదు

చివరకు
అక్కడనుంచి మరొక చోటుకు మారాను
వారానికి మూడున్నర డాలర్ల బాడుగ
అందవిహీన నేత్రాలు, ముడుతలు పడిన చర్మంతో
డబ్బై అయిదు ఏండ్ల వయసున్న స్త్రీ నడుపుతోంది ఆ చోటును
అక్కడ ఏ సమస్యా లేదు
సింక్ ఉంది
టాయిలెట్ ఉంది
రూమ్ కు కిటికీ కూడా ఉంది.

the pretty girl who rented rooms
10 January 2019

పై కవితగురించి పెద్దగా చెప్పటానికి ఏం లేదు. ఒక కాంట్రాస్ట్ చెపుతున్నాడు. చాలా సరళమైన జీవన వాస్తవికత అది.

**మరచిపోలేని నవ్వు** – A smile to remember

కిటికీ పక్కన టేబుల్ పై ఓ గాజుపాత్రలో
వలయాకారంలో ఒకదాని వెనుక మరొకటి తిరిగే
గోల్డ్ ఫిష్ లు ఉండేవి.
మా అమ్మ నిత్యం నవ్వులు చిందిస్తూ
మమ్మల్ని కూడా ఆనందంగా ఉండమని అంటూండేది
“సరదాగా ఉండు హెన్రీ” అని నాతో అనేది.
ఆమె చెప్పింది నిజమే,
ఎంత ఆనందంగా ఉండగలిగితే అంత మంచిదే కదా.
మా నాన్న మాత్రం తన ఆరున్నర అడుగుల దేహంతో ఊగిపోతూ
మా అమ్మను, నన్నూ విపరీతంగా కొట్టేవాడు
ఎందుకంటే
ఎవరు అతన్ని లోపలనుంచి హింసిస్తున్నారో
అతనికి అర్ధమయ్యేది కాదు.

మా అమ్మ, పాపం గోల్డ్ ఫిష్
రోజూ దెబ్బలు తింటున్నా ఆనందంగా ఉండాలనుకొనేది
నన్ను ఉంచాలనుకొనేది
“హెన్రీ, నువ్వెందుకు నవ్వుతూ ఉండవూ?” అంటూ
ఎలా నవ్వాలో తను నవ్వి నాకు చూపించింది ఒకసారి
నేను చూసిన అత్యంత విషాదకర నవ్వు అది.

ఒక రోజు గోల్డ్ ఫిష్ లన్నీ చచ్చి నీటిపై తేలాయి
కళ్ళు మాత్రం తెరుచుకొనే ఉన్నాయి.
ఇంటికి వచ్చిన మా నాన్న వాటిని
పిల్లికి ఆహారంగా వంటింటి నేలపైకి విసిరాడు
అపుడు
మా అమ్మ నవ్వుతూండటం నేను చూసాను
20 February 2019

అనువదించిన వాటిలో నన్ను చాన్నాళ్ళు పట్టికుదిపిన కవిత ఇది. ఎంతటి విషాదం! ఎంతటి జీవన బీభత్సం!

బుకోవ్ స్కి అమెరికన్ దిగువమధ్యతరగతికి ప్రతినిధి. ఇతని కవిత్వంలో పేదరికం, విచ్చలవిడితనం, క్రమరాహిత్యం, సౌందర్యలేమి, ప్రేమలేకపోవటం లాంటి ఉద్వేగాలు విస్మయపరిచే శైలిలో వ్యక్తీకరింపబడతాయి.

"ఎవరు అతన్ని లోపలనుంచి హింసిస్తున్నారో" అన్న వాక్యం మొత్తం కవితకు కీలకం. ఎన్ని కోణాలనైనా ఆవిష్కరిస్తుందా వాక్యం.

"అత్యంత విషాదకర నవ్వు" వద్ద కవిత ఆగిపోయినప్పటికీ అది బరువైన కవితే. కానీ ముగింపులోని విషాదం చదువరిని వెంటాడి వెంటాడి వేటాడుతుంది.

## Ogata Kenzan (1663-1743)

వలల్ని గాలాల్ని
తప్పించుకొంటూ
నీటిపై చంద్రుడు.

## Ten Years It took by Song Sun (1493-1583)

పదేళ్ళు పట్టింది
ఈ చిన్నకుటీరం నిర్మించుకోవటానికి
చలిగాలి సగం ఆక్రమించింది
మిగిలిన సగంలో వెన్నెల

కొండకు, సెలయేరుకు చోటు దక్కలేదు
బయటే ఉండిపోయాయవి.

## Hibernation by Kanupriya Dhingra

ప్రతీ శీతాకాలం
ఐస్ క్రీమ్ అబ్బాయి
పల్లీల అబ్బాయి
అవుతుంటాడు.
పాపం
అతనికి శీతాకాల నిద్ర ఉండదు.

## వ్యూహ కర్తలకు

ఎప్పుడైనా
నేను చెస్ ఆడదామని కూర్చొంటే
లక్షలాది వ్యూహకర్తలు
వాళ్ళ వాళ్ళ పనులు మానుకొని
నా భుజాలపై ఒంగి నేనేం ఎత్తు వెయ్యాలో
వాళ్ళే చెప్పేస్తుంటారు
చాలా గందరగోళంగా ఉంటోంది.

చేతులు జోడించి వారితో చెప్పనా?

ప్రియమైన పెద్దలారా
దయచేసి ఒద్దికగా కూర్చొని
నా ఆట చూడండి లేదా
మీ పనులు మీరు చూసుకోండి
నన్ను మన్నించండి
నేటినుంచి నా ఆట నన్ను
ఆడుకోనివ్వండి

- To the Game Planners by Subhash Mukhopadhyay

# శ్రీ కేదార్ నాథ్ సింగ్ కవిత్వం




నన్ను ప్రభావితం చేసిన భారతీయ భాషా కవులలో శ్రీ కేదార్ నాథ్ సింగ్ ఒకరు. ఆయన మరణ వార్త నన్నెంతో కలచివేసింది. వారి ఆత్మకు శాంతి కలగాలని కోరుకొంటున్నాను. 2010 లో వారి కవితలకు చేసిన అనువాదాలు ఇవి. ముఖ్యంగా "పదాలు చలికి చచ్చిపోవు" అన్న కవిత నాకెంతో ఇష్టమైన కవిత, అనువాదం.

★★★

శ్రీ కేదార్ నాథ్ సింగ్ (1934) ప్రముఖ ఆధునిక హిందీ కవి. వీరు రచించిన Akaal Mein Saras (Cranes in Drought) సాహిత్య అకాడమీ అవార్డు పొందింది. శ్రీ కేదార్ నాథ్ న్యూ ఢిల్లీ లోని జవహర్ లాల్ నెహ్రూ విశ్వవిద్యాలయం లో హిందీ భాషా ప్రొఫసరుగా పనిచేసారు.
వీరి కవిత్వం సరళంగా ఉంటూనే లోతైన భావాల్ని కలిగి ఉంటుంది. ఈయన శైలి "బహుళ స్వరాలతో సంభాషణాయుతం" గా ఉంటుందని విమర్శకులు అంటారు.

రోజూ దర్శించే దైనందిక విషయాలే వీరి కవిత్వంలో గొప్ప నిగూఢార్థంతో, ఒక నూతన దృష్టితో వర్ణింపబడుతూంటాయి.

స్థూలంగా చెప్పాలంటే, శిల్పం పట్ల మక్కువ కలిగిన, ప్రయోగశీలి అయిన, ఒక మానవతావాద కవిగా శ్రీ కేదార్ నాథ్ సింగ్ గారిని చెప్పుకోవచ్చు. వారి కొన్ని కవితల అనువాదాలు.

1.

**దేవుడు లేకుండానే!**

ఇదేమి వింత
ఉదయం పదికల్లా ఈ ప్రపంచం
తన పని తాను చేసుకుపోతోంది
దేవుడు లేకుండానే!
వాహనాలు నిండిపోయాయి
జనాలు తొందరలో ఉన్నారు
ఎప్పట్లానే.

భుజానికి సంచి తగిలించుకొన్న
తపాలావాలా రోజూలానే
తిరుగుతున్నాడు
దేవుడు లేకుండానే!

బ్యాంకులు వేళకే తెరవబడ్డాయి
గడ్డి పెరుగుతూనే ఉంది
అన్ని లెక్కలూ ఎంత క్లిష్టమైనవైనా
చివరకు ఓ కొలిక్కి వచ్చేస్తున్నాయి
జీవించాల్సిన వాళ్లు
జీవిస్తున్నారు
చనిపోవాల్సిన వాళ్లు
చనిపోతున్నారు
దేవుడు లేకుండానే!
ఇదేమి వింత
రైళ్లు ఆలస్యంగానో సమయానికో
ఏదో గమ్యానికి వెళ్లటమో రావటమో
జరిగిపోతూనే ఉంది
ఎన్నికలు జరుగుతున్నాయి
ఆకాశంలో విమానాలు ఎగురుతూనే ఉన్నాయి
దేవుడు లేకుండానే!

దేవుడు లేకుండానే గుర్రాల సకిలింపు కొనసాగుతూంది
సాగరంలో ఉప్పు ఇంకా తయారవుతూనే ఉంది
అటూ ఇటూ పిచ్చిగా తిరిగిన పిచ్చుక
చివరకు ఎలానో
తన గూటికి తిరిగి చేరుకొంటూంది
దేవుడు లేకుండానే!

దేవుడు లేకుండానే!
నా విషాదం మునుపెన్నడూ లేనంత
చిక్కబడుతూనే ఉంది
పది సంవత్సరాల నా పాత ప్రియురాలి కురులు
ఎన్నడూ లేనంత నల్లనైనాయి

ఇంటినుంచి బయటకెళ్లి తిరిగి చేరుకోవటం
ఇంకా వ్యామోహం గానే ఉంది ఎప్పట్లానే
ఇదేమి వింత
నీరు ప్రవహిస్తూనే ఉంది
ప్రవాహం మధ్యలో చేతులు చాపి
అలా నుంచునే ఉంది వంతెన
దేవుడు లేకుండానే!

Even Without God

2.

**రండి రండి**

రండి
మీకు వీలు కుదిరినపుడు
రండి
మీకు వీలు కుదరనప్పటికీ
రండి

చేతులలో శక్తిలా
నాళాలలో రక్తంలా
రండి
కుంపట్లోని
సన్నని మౌన జ్వాలల్లా
రండి రండి
వానల తరువాత మొలిచే
తాజా తుమ్మ ముళ్లల్లే
రాలిపోయే రోజుల్లారా
కూలిపోయే వాగ్దానాల్లారా
రండి రండి
మంగళవారం తరువాత వచ్చే
బుధవారంలా
రండి రండి

COME WHEN YOU FIND THE TIME

3.

**పండు రుచి లా....**

ఆకాశంలో తారలు
నీళ్లల్లో చేపలు
గాలిలో ప్రాణవాయువు
సరిగ్గా అలానే ఈ భూమిపై
నేను
నువ్వు
అనిలము
మరణము
దిరిసెన పూలు
అగ్గిపుల్ల తల
ఇంటి తలుపు
వీపుపై కురుపు
పండు రుచి

సరిగ్గా అలానే......
సరిగ్గా అలానే.......

LIKE FLAVOUR OF FRUIT

4.

**పదాలు చలికి చచ్చిపోవు**

పదాలు చలికి చచ్చిపోవు
ధైర్యం లోపించటం వల్ల చస్తాయంతే
పదాలు తడి కాలంలో
చెడిపోతాయి ఎక్కువగా

మా ఊరి ఏటిగట్టుపై
ఒకసారి నేనో పదాన్ని కలిసాను
మెరిసే ఎర్రపిట్టలా ఉందది
ఇంటికి తీసుకొచ్చాను
గుమ్మం వద్దకు చేరగానే
వింతైన బెదురు చూపులతో
నన్ను చూస్తూ చచ్చిపోయింది అది
అప్పటి నుంచీ పదాలంటే భయం నాకు
వాటి మధ్యకు వెళ్లినా వెంటనే వెనక్కు వచ్చేస్తాను
రంగు రంగుల దుస్తులు వేసుకొని
జుట్టు విరబోసుకున్న పదం నా వైపు రావటం చూస్తే
వెంటనే నా కనులు మూసేసు కొంటాను
నెమ్మది నెమ్మదిగా
ఈ ఆటను ఆనందించటం మొదలెట్టాను
నేనో రోజు గడ్డి మేటు కింద
పాములా నక్కిన ఓ అందమైన పదాన్ని
రాయితో గాయపర్చాను అకారణంగా
దాని చక్కని మెరిసే కళ్ళను
ఈ నాటికీ నేను మరచిపోలేదు

కాలం గడిచే కొద్దీ
నా భయం తగ్గసాగింది
ఈ రోజు పదాలు ఎదురైతే
కుశల ప్రశ్నలు వేసుకుంటాం
ఇపుడు నాకు
అవి దాక్కునే చోట్లెన్నో తెలిసాయి
వాటి వివిధ వర్ణాలు చాలామట్టుకు

నాకు పరిచితమయ్యాయి
సాదా పదాలు, గోధుమ చామనిచాయ రంగుల్లోను
విధ్వంశక పదాలు, లేత పసుపు పింక్ రంగుల్లోను
ఉంటాయని నేనిప్పుడు చెప్పగలను

విషాదకర, గంభీర సందర్భాలకోసం
మనం దాచుకొన్న పదాలు
వాటికుద్దేశింపబడిన సందర్భాలలో
చాలా జుగుప్స కలిగించే పదాలే కావటం
తరచూ జరిగేదే

బొత్తిగా పనికి రానివనీ
హీన వర్ణాలను తొడుక్కొన్నాయనీ
చెత్తలో పారేసిన పదాలే
నా ఆపత్కాలలో సహాయపడ్డాయన్న
నిజాన్ని కనుగొన్నాను
ఇపుడేం చేయగలను నేను

నిన్నేం జరిగిందంటే
ఓ అరడజను సొగసైన పదాలు
చీకటి వీధిలో అకస్మాత్తుగా
నన్ను చుట్టు ముట్టాయి
భయమేసింది నాకు
మాటల్లేకుండా కొద్దిసేపు వాటిముందు
అలా నిలచుండి పోయాను, చమటతో తడుస్తో
తేరుకొని పరుగు ప్రారంభించాను
నా పాదాలు గాల్లోకి లేస్తుండగా
రక్తంలో తడిచిన ఓ చిన్నారి పదం
ఎక్కడినుంచో ఆయాసపడుతూ నన్ను చేరి
" రా, నేను నిన్ను ఇంటికి చేరుస్తాను" అంది.

WORDS DON'T DIE OF COLD

## కరువుకాలం కొంగలు

ఒకానొక మధ్యాహ్నం వేళ
అవి వచ్చాయి
అవి వచ్చినపుడు
అవి అలా వస్తాయని ఎవరూ ఊహించలేదు
ఒకదానివెనుక మరొకటి
గుంపులు గుంపులుగా వచ్చాయి
మెల్లమెల్లగా ఆకాశం మొత్తాన్ని
అలముకొన్నాయి

క్రమక్రమంగా ఊరు మొత్తం
కొంగల అరుపులతో నిండిపోయింది.
చాలాసేపు అవి ఊరిమీద తిరుగుతూ
రెక్కల్లోంచి ఊడిపడినట్లు
ఇంటికప్పులపై, పాకలపై, గడ్డిమేట్లపై వాలాయి.
ఒక ముసలమ్మ వాటిని చూసింది.
అవును... అవును...
ఇవి నీటికోసమే వెతుకుతున్నాయి
అని అనుకొంది
వంటింట్లోకి వెళ్ళి
ఒక కుండతో నీరు తెచ్చి
పెరటి మధ్యలో ఉంచింది

కొంగలు మాత్రం
ఆ ముసలమ్మని, ఆమె ఉంచిన నీటికుండనూ
గమనించకుండా
ఊరిమీదే చాలాసేపు తిరుగాడాయి.
క్రింద నివసించే జనం
తమను కొంగలు అని పిలుస్తారని కూడా
బహుసా ఆ కొంగలకు తెలియకపోవచ్చు
సుదూరప్రాంతం నుంచి
నీటికొరకు అన్వేషణలో ఆ కొంగలు

ఈ ఊరికి వచ్చాయి

తమ మెడలను వెనక్కు తిప్పి
అసహ్యమో, జాలో తెలియని చూపులతో
ఊరినొకసారి చూసి
గాల్లో రెక్కలు తపతప లాడించుకొంటూ
ఎగిరిపోయాయి.

Source: Cranes in a Drought ( Akaal men Saras)
English Translation: Sri. B.S.N Murthy

**రెండు నిముషాల మౌనం**

సోదర సోదరీ మణులారా
ఈ రోజు మరణిస్తున్నది
మరణిస్తున్న ఈ దినం కోసం
రెండు నిముషాల మౌనం

ఎగిరిపోతూన్న పక్షికోసం
నిశ్చల జలాల కోసం
మీద పడుతున్న రాత్రికోసం
రెండు నిముషాల మౌనం
దాని కోసం
కాని దాని కోసం
అయిఉండాల్సిన దానికోసం
రెండు నిముషాల మౌనం

విసిరేసిన తొక్కకోసం
నలిగిపోయిన గరిక కోసం
ప్రతీ యత్నం కోసం
ప్రతీ పథకం కోసం
రెండు నిముషాల మౌనం

ఈ గొప్ప శతాబ్దం కోసం
ఈ శతాబ్దపు ప్రతీ గొప్ప ఆలోచన కోసం
దాని గొప్ప పదాలకోసం
ఇంకా గొప్ప ఉద్దేశాలకోసం
రెండు నిముషాల మౌనం
సోదర సోదరీమణులారా
ఈ గొప్ప విజయాలకోసం
రెండు నిముషాల మౌనం
రెండు నిముషాల మౌనం
Kedarnath Singh -- A Two-Minute Silence

## Naphtha by Frank O'Hara

ఇంత వినోదాత్మకంగా ఉంటోన్న
ఈ శతాబ్దాన్ని చూస్తుంటే నాకు సిగ్గుగా ఉంది.
అయినా నవ్వకతప్పదు.

## ఎవరో నా పర్స్ లో నివసిస్తున్నారు! by Glory Sasikala



ఎవరో నా హాండ్ బాగ్ లోకి దూరారు
దుఃఖం అంటే తెలుసు నాకు
చెమ్మగిలిన చేతి రుమాలు
తల సరిగ్గా దువ్వుకోని రోజున
ఒక దువ్వెన అందించారు
చాక్లెట్స్ పంచారు
బాగ్ మూలల నిండా
చాక్లెట్ రేపర్లు
మెసేజులు వ్రాసుకొన్న టిష్యూ పేపర్లు
ఎవరో నా బొమ్మలకు
మీసాలు గెడ్డాలు పెట్టారు
నా క్రెడిట్ కార్డ్ లిమిట్ మించిపోయింది
నిజం ఒట్టు
వారెప్పుడు నిష్క్రమించారో గుర్తులేదు
కానీ
చెమ్మగిలిన చేతిరుమాలు క్రిందకి
ఒక కొత్త వజ్రపుటుంగరం వచ్చి చేరింది
నా దినచర్యలన్నీ తలక్రిందులయ్యాయి
జాగింగ్ చేయాల్సిన వేళల్లో
బట్టలుతుకుతూంటాను
ఎవరో నా పర్స్ లో నివసిస్తున్నారు
ఎవరో , ఎవరో , ఎవరో
నా జీవితాన్ని జీవించేస్తున్నారు

Someone's Living In My Purse!

## Nicanor Parra యాంటి పొయట్రీ



నికనార్ పర్రా తన కవిత్వాన్ని "యాంటి పొయట్రీ" అన్నాడు. సంప్రదాయ కవిత్వవ్యూహాల్ని బద్దలు కొట్టిన కవిత్వంగా అది పేరుతెచ్చుకొంది.

ప్రేమ గురించి చెప్పవలసి వచ్చినపుడు, ఉద్యానవనాలు, జంట పక్షులు, మన్మధబాణాలు, దూతికలు, కెంపు చెక్కిలులు, కలువలు చందమామ, తుమ్మెదలు, పద్మాలు వంటి వర్ణణలు ఉండాలి అని లాక్షణికులు నిర్ధేశించారు. ఇది ఒకరకంగా ఒక ప్రామాణిక చట్రంగా ఉండింది. ఆధునిక కాలంలో విప్లవంలాంటి అత్యాధునిక వస్తువును వర్ణించేటపుడు కూడా- నెత్తురు, అరణ్యం, సూర్యుడు, తూరుపు, పురిటినొప్పులు, కొత్తసృష్టి, మరో ప్రపంచం లాంటి తత్సంబంధ ఆంబియన్స్ వచ్చేలా వ్రాయటం నేటికీ మనం చూడవచ్చు. ఈ నియమాలను బ్రేక్ చేసేదే "యాంటి పొయెట్రీ"

ఈ క్రింది కవిత తల్లికి జ్వరం తో మొదలవుతుంది. నిజానికి సాంప్రదాయ సాహిత్యంలో తల్లి జబ్బు పడితే హీరో వెళ్ళి రక్తాన్ని కొనుక్కొని రావటం, ఆ బాటిల్ పగిలిపోయి సింబాలిక్ గా రక్తం నేలపై పడినట్లు చూపటం, ఆ తల్లి చనిపోవటం... లాంటి వరుస సీక్వెన్స్ లు ఉంటాయి.

కానీ ఈ కవితలో అలాజరగదు. అలా బయటకు వచ్చిన హీరోకు తన భార్యవేరెవరితోనో కనపడుతుంది. సరే రెండో ఎపిసోడ్ లోకి వెళదామా అనుకొంటే అందులో కూడా సాంప్రదాయతను పాటించడు కవి.....
ఈ కవితలో కనిపించే అనూహ్యత ఆధునిక జీవితంలోని సంక్లిష్టతగా అర్ధం చేసుకోవాలి. ఇలాంటి ప్రవర్తన "అసమర్ధుని జీవితయాత్ర" సీతారామారావ్ లో కూడా కొంచెం కనిపిస్తుంది.

ఇలా కవితలో ఒక్కొక్కటిగా విచ్చుకొనే ప్రతీ సంఘటననూ అనూహ్యంగా మళ్ళించి 'సాంప్రదాయ చట్రాన్ని" ముక్కలు చెక్కలు చేస్తాడు కవి అంతిమంగా. దీన్నే యాంటి పొయెట్రీ గా చెప్పుకొన్నాడు నికనార్ పర్రా
ఇంతటి స్థాయిలో యాంటి పొయెట్రీ రాసిన తెలుగు కవులు ఉన్నారని నేను అనుకోను.

**A Man** by Nicanor Parra

అమ్మకు విపరీతమైన జ్వరం
డాక్టరుని పిలవటానికని బయటకు వచ్చాడతడు
ఏడుస్తున్నాడు
వీధిలో అతని భార్య వేరొక పురుషునితో
చెట్టాపట్టాలేసుకొని కనిపించింది
చెట్లవెనకాల నక్కుతూ వారిని మెల్లగా వెంబడించాడు
ఏడుస్తున్నాడు

ఇంతలో అతని చిన్ననాటి స్నేహితుడు కనిపించాడు
చాలా ఏళ్లయింది ఇద్దరూ కలుసుకొని
వారిద్దరూ బార్ కు వెళ్ళి
పాత సంగతులు గుర్తుచేసుకొన్నారు.
స్నేహితుడు పాస్ పోసుకోవటానికి
బాత్ రూమ్ కు వెళ్ళిన సమయంలో
అంట్లుతోమే అమ్మాయి ఇతనికి పరిచయమైంది
ఆమె నడుముపై చేయి వేసి దగ్గరకు లాక్కొన్నాడు
ఇద్దరూ డాన్స్ చేసారు.
రోడ్డుమీదకు వచ్చారు
నవ్వుకొంటూ నడుస్తున్నారు
ఒక ఆక్సిడెంట్
ఆ అమ్మాయి స్పృహ కోల్పోయింది
ఫోన్ చేయటానికి అతను పరిగెట్టాడు
ఏడుస్తున్నాడు

లైట్లు వెలుగుతున్న ఓ ఇంటిలోకి చొరబడి
ఫోన్ చేసుకొంటానన్నాడు
అతనిని ఎవరో గుర్తుపట్టి పలకరించారు
కాదు
ఫోనెక్కడుంది? అన్నాడతను.
నీరసంగా ఉన్నావు, ఏదైనా తినివెళ్ళు' అన్నారు వాళ్ళు
తినటానికి కూర్చున్నాడతను

పిచ్చిపట్టినవాడిలా మద్యం సేవించాడు
నవ్వుతున్నాడు
వాళ్ళు అతనితో పాటలు పాడించారు
పాడీ పాడీ చివరకు అతను
బల్లక్రింద మత్తు నిద్రలోకి జారుకొన్నాడు.

A Man by Nicanor Parra

2.

**చివరి విందు** – by Nicanor Parra

మనకు ఇష్టమున్నా లేకున్నా
మూడు చాయిస్ లు మాత్రమే ఉన్నాయి
నిన్న నేడు రేపు
మూడు కూడా కాదు
ఎందుకంటే ఒక వేదాంతి అన్నట్టు
నిన్న అనేది నిన్నే
ఒఠి జ్ఞాపకాలలో మాత్రమే అది మనది:
రేకలన్నీ తుంచబడ్డ గులాబీ నుంచి
కొత్తగా ఏ రేకల్నీ పెరకలేం

ఆడేందుకు రెండు పేకముక్కలు
మాత్రమే ఉన్నాయి
వర్తమానము భవిష్యత్తు
ఇంకా చెప్పాలంటే రెండు కూడా లేవు
గతానికి దగ్గరగా వెళ్ళిందా
వర్తమానమూ లేనట్టే
కరిగిపోతుంది
యవ్వనంలా

చివరకు
రేపు ఒక్కటే మిగిలుంది మనకు.
నేను మధుపాత్రను పైకెత్తి
కోరుకొంటున్నాను
ఎన్నటికీ రాని ఆ రోజుకు జయం కలగాలని.
మనకు మిగిలుంది అది మాత్రమే.

Last Toast – by Nicanor Parra

## జీవన వాస్తవికతను ప్రతిబింబించే Wislawa Szymborska కవిత్వం



"సమకాలీన నేపథ్యం లోంచి మానవ జీవన వాస్తవికతను వ్యంగ్యాత్మక పదునుతో వ్యక్తీకరించే కవిత్వాన్ని వ్రాసినందుకు" అంటూ విస్లోవా షింబోర్స్కా కు 1996 లో నోబుల్ పురస్కారం అందించారు.

నర్మగర్భంగా ఉండే విషాదాన్ని పైకి కనిపించే సరళతతో దాయటం షింబోర్స్కా కవిత్వ లక్షణం. తేటదనం, గూఢార్ధమూ ఒకదానితో ఒకటి పోటీపడతాయి. ఆమె కవిత్వం అంత తేటగా ఉన్నప్పటికీ అశేష పాఠకుల ఆదరణ పొందటం పెద్ద పెద్ద విమర్శకులను ఆశ్చర్యపరచిన అంశం. ఆమె ఏ సిద్ధాంతాలకు, స్కూల్ ఆఫ్ థాట్స్ కు చెందకుండా-చారిత్రిక సంవేదనలకు, కవి సామాజిక బాధ్యతలకు, కట్టుబాట్లకు దూరంగా ఉండి- తనదైన శైలిని నిర్మించుకొన్నారు.

ఈ క్రింది కవితలో ఒక విషాదఘట్టాన్ని ఒక టెర్రరిస్టు పాయింటాఫ్ వ్యూతో వర్ణిస్తారు షింబోర్స్కా. సంఘటనా స్థలం నుంచి ఒక రిపోర్టులా అనిపిస్తున్నా అంతర్లీనంగా ఒక దిగులు ఉంది కవితలో.

★★★

1.

**ఉగ్రవాది.... చూస్తున్నాడు** ---

సరిగ్గా ఒంటిగంటా ఇరవై నిముషాలకు
అక్కడో బాంబు పేలనుంది.
ఇప్పుడు సమయం ఒంటిగంటా పదహారు నిముషాలు.
ఇంకా కొంత సమయం ఉంది.
కొంతమంది లోనికి రావటానికి
మరికొంతమంది బయటకు పోవటానికి
విస్ఫోటనం వల్ల ఏ హాని జరగనంత దూరంలో
ఉగ్రవాది దాక్కొని అంతా గమనిస్తున్నాడు
సినిమాల్లో చూపించే విధంగానే:

పచ్చరంగు దుస్తుల్లో ఒక స్త్రీ లోనికి వెళ్లింది
నల్లకళ్లద్దాలు ధరించిన అతను బయటకు వచ్చాడు

జీన్స్ వేసుకొన్న కుర్రాళ్లు మాట్లాడుకొంటున్నారు
మరో నిముషం గడిచింది
పొట్టిగా ఉన్న అతను బహుసా అదృష్టవంతుడు
స్కూటరెక్కి వెళిపోయాడు అక్కడనుంచి
ఓ పొడుగతను లోపలకు వెళుతున్నాడు
పదిహేడునిముషాల నలభై సెకన్లు
ఆకుపచ్చ రిబ్బన్ కట్టుకొన్న అమ్మాయి వస్తోంది
బస్సు అడ్డంగా రావటం వల్ల
ఆమె లోపలకు వెళ్ళిందా లేదా అన్నది తెలియలేదు
పద్దెనిమిది నిముషాలు
ఆ అమ్మాయి లోపలకు వెళ్ళిఉంటుందా లేదా?
ఏమో! శవాలను బయటకు మోసుకొచ్చినప్పుడు చూడాలి
పంతొమ్మిది నిముషాలు
ఎవరూ లోపలకు వెళుతున్న జాడ లేదు
ఓ బట్టతల వ్యక్తి బయటకు వచ్చాడు
గ్లోవ్స్ కోసం జేబులు ఒకసారి తడుముకొని
మళ్ళా లోపలకు వెళిపోయాడు
ఒంటిగంటా ఇరవై నిముషాలు
కాలం సాగుతోంది
సమయం అయిపోయింది
ఇంకా కాలేదు
అవును అప్పుడే
బాంబు...... విస్ఫోటనం జరిగింది

The Terrorist, He Watches by Wislawa Szymborska

## ఏమైతేనేం

అది జరిగుండేది
అది జరిగితీరాలి
ముందూ జరిగింది, తరువాతా కూడా
పక్కనే జరిగింది, దూరంగా కూడా
అది జరిగింది.
కానీ నీకు జరగలేదు

బహుసా మొదటివాడవు కనుక నీకు జరగలేదు
బహుసా చివరివాడవు కనుక నీకు జరగలేదు
నీవల్లే కావొచ్చు, ఇతరుల వల్ల కూడా కావొచ్చు
కుడివైపు ఉండటం వలనో ఎడమవైపు ఉండటం వలనో
వర్షం వస్తున్నందుకో, ఎండకాస్తున్నందుకో
ఓ నీడ కూలిపోయినందుకైనా కావొచ్చు
అదృష్టంకొద్దీ అక్కడ అరణ్యం ఉంది
అదృష్టంకొద్దీ అక్కడ చెట్లు లేవు
అదృష్టంకొద్దీ ఒక పిట్టగోడ, ఒక కొక్కెం, ఒక దూలం, ఒక బ్రేక్
ఒక అంచు, ఒక మలుపు, ఒక్క అంగుళం, ఒక్క క్షణం.
అదృష్టం కొద్దీ ప్రవాహంలో తేలుతోన్న గడ్డిపరక దొరికింది.

అలా, ఇంకా, అయినప్పటికీ లకు ధన్యవాదాలు
ఒక చేయి , ఒక కాలు, ఒక అడుగు, ఒక వెంట్రుకవాసి దూరాలు
దగ్గరయ్యుంటే ఏంజరిగుండేది?
ఆ విధంగా నువ్వు ఇక్కడ ఉన్నావు
ఘనీభవించిన క్షణం నుంచి బయటపడి.
వల చాలా చిక్కగా ఉంది.
కానీ నువ్వు? ఏమైతేనేం? తప్పించుకోగలిగావు.
నాకు ఒక అద్భుతాన్ని చూస్తున్నట్లు ఉంది.
దీని గురించి మాట్లాడకుండా ఉండలేను
విను
నీ గుండె నాలో ఎంత వేగంగా కొట్టుకొంటోందో.

Any Case by Wislawa Szymborska

## తాళం చెవులు పోతే ఏంచేయాలి... Carlos Galindo Lena



తాళం చెవులు పారేసుకొని ఒంటరిగా మిగిలిపోతే ఏంచేయగలను
రాత్రి పైకప్పు మీద ఏదో అడవిమృగం నడుస్తోన్న శబ్దాలు
నక్షత్రరాశుల ఆకారాల బరువుకి చెట్లు మూలుగుతున్నాయి
ఆకులు రాల్చుకొంటోన్న కాలం, బయట ఎవరో రోదిస్తున్నారు
బహుసా తన కన్నీళ్ల భారం తెలిసిన వ్యక్తి ఎవరో
గదిలో అంతవరకూ వెలిగిన జీవనజ్యోతి మూగబోయింది

నేను ఒంటరినైనాను
తాళం చెవులు పడిపోయాయి

ఒక్కసారిగా నా చేతుల్లోకి పుష్పరక్తం ఎగజిమ్మింది
నాన్నా,... నను కన్న తండ్రీ ... పది వసంతాలు గతించాయి
డైనింగ్ టేబుల్ క్లాత్ పదిలంగానే ఉంది
నీళ్ళ కూజా పక్కనే మధుర ఫలాలు
కాగితం పూల పక్కనే స్పూనులు
ఆ నిన్నటి పూలను ఎవరూ తుంచే సాహసం చేయరు
ఊహల ఫ్రేములో శిథిలమౌతోన్న ముఖచిత్రాన్ని చెరపాలనుకోరు
కర్టెన్ తన కన్నీటి గురుతుల్ని అలానే నిలుపుకొని ఉంది

తాళాలు పోగొట్టుకొని, ఒంటరిగా మిగిలిపోయి
ఏంచేయను నాన్నా,... ఏంచేయగలను
అన్ని తలుపులూ శాశ్వతంగా తాళాలు వేయబడ్డాయి... అన్నీ...
గోడలకవతల సోమరి చెరశాల బంట్రోతు అరుస్తోన్నాడు
"బయట ఉన్నవారు శిథిలమౌతారు"
ఆకులు రాల్చుకొంటోన్న కాలం, బయట ఎవరో రోదిస్తున్నారు
చెరశాల బంట్రోతు రాత్రినూతిలోకి తాళం చెవులు విసిరేసాడు

What to do if I've lost the keys . . .by Carlos Galindo Lena

## కవిత్వం -- by Heberto Padilla



సత్యం మాట్లాడు
కనీసం నీ సత్యం
ఆ తరువాత
ఏదైనా జరగనీ
వాళ్లు నీకిష్టమైన పేజీలను చించేయనీ
వాళ్లు నీ తలుపు తట్టనీ
ప్రజలు నీ చుట్టూ చేరి
నిన్నో
అద్భుతంలానో
మృతప్రాయంగానో చూడనీ

## A Poem by Luis Rogelio Nogueras – cuban poet



భీకర వర్గపోరాటపు అల్లకల్లోలంలో
అతను ఓ ప్రేమకవిత వ్రాసాడు
న్యాయం కోసం ప్రాణాలకు తెగించినపుడు
అతను ఓ ప్రేమ కవిత వ్రాసాడు
మృత్యువు, చిత్రహింసలు చుట్టుముట్టినపుడు
అతను ఓ ప్రేమకవిత వ్రాసాడు
రక్తము, బుల్లెట్ల మధ్యలో
అతను ఓ ప్రేమ కవిత వ్రాసాడు
ఎవరికీ చెందని ఒక కవిత
తన ఊహా ప్రేయసిపై వ్రాసుకొన్నాడు
ఇప్పుడు
అతని నీడల లోతువరకూ ప్రేమిస్తూ
అతని గాయాలకు ముద్దులిడుతూ
ఆ అమ్మాయి
ఇప్పుడు
ఎముకలు కొరికే రాత్రిచలిలో
తన నగ్నదేహాన్ని అతనిపై కప్పుతూ
ఆ అమ్మాయి

అతను తన ప్రేయసి కలచెదరకుండ
మెల్లగా లేచి
పెన్ను, కాగితం తీసుకొని
ఒక
రాజకీయ కవిత వ్రాసాడు
సమ్మెలు పోరాటాల తీవ్రత నిండిన కవిత

## ఎప్పటికీ పుట్టని కొడుకు కోసం ప్రార్ధన by Luis Rogelio Nogueras

మనం చాలా పేదవాళ్లం బిడ్డా చాలా పేదవాళ్ళం
ఎలుకలు కూడా మనపై జాలి పడేవి.
ప్రతీ ఉదయం మీ నాన్న టౌనుకెళ్ళి
ఎవరైనా శక్తికలవారు పని ఇస్తారేమోనని చూసేవాడు
– గుప్పెడు బియ్యం కొరకు పసులకొట్టం శుభ్రం చేసే పనైనా సరే.

యాచనల్ని, మూలుగుల్ని వినకుండా, కనీసం ఆగకుండా
శక్తివంతులు ముందుకు సాగిపోయేవారు.
మురికిదుస్తులవెనుక బక్కచిక్కిన దేహంతో
రాత్రెపుడో మీ నాన్న వచ్చేవారు వెలవెలబోతూ
నేను ఏడ్చేదాన్ని.

అప్పుడే నేను ప్రార్ధించాను
మాతృత్వాన్ని, గర్భధారణ శక్తిని ఇచ్చే Jizo ని
నిన్ను ఈ ప్రపంచంలోకి పంపించవద్దని, నా బిడ్డా
నిన్ను ఈ ఆకలి, అవమానాలకు అప్పగించవద్దనీ.
దయగల దైవం నా మొర ఆలకించింది.

అలా ఏళ్లు గడిచిపోయాయి నిస్సారంగా.
నా రొమ్ములు ఎండిపోయాయి
మీ నాన్న చనిపోయాడు
నేను ముసలిదాన్నయిపోయాను.
నేనూ ముగింపుకొరకు ఎదురుచూస్తున్నాను
నల్లనిదుప్పటి విసిరి కనులు కప్పే రాత్రికొరకు
ఎదురుచూసే సూర్యాస్తమయంలా.

Jizo కు ధన్యవాదాలు
కనీసం నువ్వైనా యజమానుల కొరడా దెబ్బలు,
ఈ బాధాకరమైన కుక్కబ్రతుకు తప్పించుకొన్నావు.
ఏదీ, ఎవ్వరూ నిన్ను బాధించలేరు.
నేర్పుకల బాణం సుదూర గద్దను చేరలేకపోయింది
ఈ లోకపు బాధలు ఏవీ నిన్ను చేరలేవు.

Prayer for the Son Who Will Never Be Born by Luis Rogelio Nogueras (క్యూబన్ కవి)

## Poems from "Scars Set In Stone" by Shenaia Lucas

1.

మన సమాజం అందానికి ఇచ్చే
నిర్వచనం పరిధిలోకి
ప్రతిఒక్కరినీ తీసుకొనే వరకూ
నాకు శాంతి కలుగదు
ఎందుకంటే ప్రతిఒక్కరికీ
వారు అందంగా ఉన్నారని
గుర్తింపబడే అర్హత ఉంది. -beautiful

2.

అది ఆమె దేహం
అది ఆమె నిర్ణయం
ఇక చర్చించటానికేమీ లేదు -her choice

3.

పురుషులు బలవంతులని
స్త్రీలు అబలలనీ
నాతో ఎన్నడూ అనకు
స్త్రీలు ప్రతినెలా
నెత్తురు స్రవించటం పట్ల
వారు భీతిల్లుతారు — bleed

## Octavio Paz కవిత్వం



Octavio Pazమెక్సికన్ కవి (1914 – 1998). ఇతని The Labyrinth of Solitude ప్రపంచప్రసిద్ధిగాంచింది. ఇతని కవిత్వం వచనంలాగ, వచనం కవిత్వంలాగా ఉంటుందని విమర్శకుల అభిప్రాయం. పాజ్ భారతదేశంలో మెక్సికన్ రాయభారిగా అరవైలలో పనిచేసాడు. అప్పుడు భారతీయ సాహిత్యాన్ని అధ్యయనం చేసాడు. వివిధ చారిత్రిక ప్రదేశాలపై పాజ్ అనేక కవితలు వ్రాసాడు. ఏదేశ కవిత్వమైనా ఆ దేశ చరిత్రను ప్రతిబింబిస్తుందని, మానవ నాగరికతలోని బహుళత్వాన్ని సాహిత్యం వ్యక్తీకరిస్తుందని పాజ్ విశ్వసించేవాడు.

★★★

1.

**వీధి**

జనసంచారం లేని వీధిలో
చీకట్లో పడుతూ లేస్తూ
ఎండుటాకులపై
మౌనం ధరించిన రాళ్లపై
తడబడుతూ నడుస్తున్నాను
నా వెనుక కూడా ఎవరో నడుస్తున్నారు
నేనాగితే, అతనూ ఆగుతున్నాడు
నే పరిగెడితే, అతనూ పరిగెడుతున్నాడు.
వెనక్కు తిరిగి చూస్తే.... "ఎవరూ ఉండరు"
అంతా చీకటి, బయట పడే మార్గం లేదు
తిరిగి తిరిగి మళ్ళా ఆ వీధి మధ్యకే వస్తున్నాను
ఇక్కడ నాకోసం ఎదురుచూసే వారు లేరు
ఎవరూ నన్ను అనుసరించరు
నేను మాత్రం ఆ వ్యక్తిని అనుసరిస్తూన్నాను
అతను కూడా పడుతూ, లేస్తో
ఒక్కసారిగా నన్ను చూస్తూ
"ఎవరూ లేరిక్కడ" అని గొణుక్కొంటున్నాడు

The streat by Octavio Paz

2.

**లోపలి వృక్షం**

ఒక చెట్టు నా తలలో పెరుగుతోంది
నా లోలోతుల్లోకి చొచ్చుకొంటూ.
దాని వేళ్లు రక్తనాళాలు
దాని కొమ్మలు నరాలు
చిక్కువడిన ఆకుల దొంతరలు ఆలోచనలు
నీ చూపు దాన్ని దహిస్తుంది

దాని నీడల ఫలాలు
రక్త నారింజలు, మంటల దానిమ్మలు.

దేహ రాత్రిలో ఉషోదయమైంది
నాలోంచి, నా లోతుల్లోంచి
చెట్టు మాట్లాడుతోంది.
దగ్గరకు రా ... నీకు వినిపిస్తోందా?
– A Tree within by Octavio Paz

3.

**ఉదయం**

వడిగల చల్లని చేతులు
చీకటి బేండేజీలను ఒక్కొక్కటీ
తొలగిస్తున్నాయి
కళ్ళు తెరిచాను
నేనింకా
ఒక ఆరని పచ్చిగాయంలో
బతికే ఉన్నాను
Dawn by Octavio Paz

4.

**Life Glimpsed** by Octavio Paz

సముద్రపు రాత్రిలో
చేపలు తళుక్కుమంటాయి
అరణ్యపు రాత్రిలో
పక్షులు తళుక్కుమంటాయి
దేహపు రాత్రిలో
ఎముకలు తళుక్కుమంటాయి
ఓ ప్రపంచమా, నీ రాత్రులలో
జీవితం తళుక్కుమంటోంది.

**Life Glimpsed**

5.

## స్పర్శ

నా చేతులు
నీ అస్తిత్వపు తెరలను తొలగిస్తున్నాయి
నీకు మరింత నగ్నత్వాన్ని తొడుగుతున్నాయి
నీ దేహంలోని దేహాలను వెలికితీస్తున్నాయి
నా చేతులు
నీ దేహం కొరకు మరో దేహాన్ని సృష్టిస్తున్నాయి

Octavio Paz — Touch

6.

**రెండు దేహాలు**

ఎదురెదురుగా ఉన్న రెండుదేహాలు
ఒక్కోసారి రెండు కెరటాలు
రాత్రేమో ఒక సముద్రం

ఎదురెదురుగా ఉన్న రెండుదేహాలు
ఒక్కోసారి రెండు రాళ్ళు
రాత్రి ఒక ఎడారి

ఎదురెదురుగా ఉన్న రెండుదేహాలు
ఒక్కోసారి రాత్రిలోకి అల్లుకొన్న
రెండు వేర్లు

ఎదురెదురుగా ఉన్న రెండుదేహాలు
ఒక్కోసారి రెండు కత్తులు
రాత్రి మెరుపులు ఝుళిపిస్తూంటుంది

ఎదురెదురుగా ఉన్న రెండుదేహాలు
ఖాళీ ఆకాశంలోకి పడిపోతున్న
రెండు నక్షత్రాలు

Two Bodies by Octavio Paz

## స్మృతులకు ప్రాణం పోసిన Wadih Saadeh కవిత్వం



"కవిత్వం అనేది గతించిన కాలపు పరిభాష మాత్రమే కాదు, అది ఒక సృష్టి ప్రక్రియ, కలను పునర్జీవింపచేయటం, నేనెలా ఉండాలనుకొంటానో అలా నన్ను నేను పునస్థాపించుకోవటం" -- Wadih Saadeh.

Wadih Saadeh లెబనాన్ లో ఒక చిన్న కుగ్రామంలో పుట్టి పన్నెండేళ్ల వయసులో Bierut అనే ప్రాంతానికి వలసవెళ్లాడు. ఒంటరితనం, అభద్రతా ఇతన్ని కవిత్వం వైపు నడిపించాయి. అంతర్యుద్ధం వల్ల నెలకొన్న భీతావహపరిస్థితుల కారణంగా స్వదేశాన్ని విడిచి ఆస్ట్రేలియా చేరుకొన్నాడు. తన చిన్నతనంలో ఏ యుద్ధాలు లేని, ప్రకృతి సహజ సౌందర్యాలతో ప్రకాశించే ప్రశాంత లెబనాన్ ఇతని అంతరంగంలో శాశ్వతంగా నిలిచిపోయింది. యుద్ధరక్తగాయాలతో ఛిద్రమైన లెబనాన్ ప్రస్తుత వాస్తవం. ఈ రెండింటి ఘర్షణే ఇతని కవిత్వానికి నేపథ్యంగా మారింది. వాదీ సాదే కవిత్వం లెబనాన్ విషాదభరిత యుద్ధాలను కవిత్వీకరిస్తుంది. ఒక్కో కవితా - సలిపేగాయంలా, చిందిన రక్తపు చారికలా, ఒక అధివాస్తవిక ప్రపంచంలా, మెత్తని కుంచెతో గీసిన ఒక వర్ణచిత్రంలా అనిపిస్తుంది. వేదనను, దుఃఖాన్ని ఎంతో సున్నితంగా వ్యక్తీకరించటం వల్ల అది మరింత చిక్కబడింది. వాదీ సాదీ ఇంతవరకూ 12 కవిత్వసంపుటలను వెలువరించారు. "A Secret Sky" కవితా సంపుటి నుంచి కొన్ని కవితల అనువాదాలు ఇవి. ఈ సంపుటిలోని కవితలన్నీ లెబనాన్ అంతర్యుద్ధాన్ని బలంగా వ్యక్తీకరిస్తాయి. హింసతో ఆత్మహత్యాసదృశ మార్గాన్ని ఎంచుకొంటున్న ఆధునిక మానవుని పోకడను ప్రశ్నించే కవిత్వం ఇది.

దేశబహిష్కృతుడిగా జీవనం, మాతృభూమిపై మమకారం అనే రెండు భావాల మధ్య సంఘర్షణ కారణంగా వాదీ సాదీ కవిత్వంలో ఆధునికోత్తర శూన్యవాదం బలంగా ప్రతిబింబిస్తుందని విమర్శకుల అభిప్రాయం. వాదీ సాదీ కవిత్వాన్ని గమనిస్తే భీభత్సాన్ని, హింసను, దుఃఖాన్ని వ్యక్తీకరించటానికి బరువైన, జుగుప్సకలిగించే పదాలను వాడాల్సిన అవసరం లేదనీ, నాజూకైన తేలికపదాలతో కూడా అంతే స్థాయి భావోద్వేగం కలిగించవచ్చని అర్థమౌతుంది. అలా వ్రాయటం నేటికాల కవిత్వలక్షణంగా భావించాలి. "A Secret Sky లో నేను లెబనాన్ యుద్ధంలో మరణించిన నా సహచరులకు ప్రాణం పోసాను" అన్న వాదీ సాదీ మాటలకు ఈ సంపుటిలోని ప్రతీ కవిత అద్దంపడుతుంది. ఈ కవితలను అరబిక్ భాషనుండి ఇంగ్లీషులోకి Anne Fairbairn అనువదించారు.

1.

**లేకపోవటం** – Absence

ఆ రోజు
పార్కులో
ఒక ఓక్ చెట్టు క్రింద ఉన్న
రెండు రాతికుర్చీలు మాత్రమే
ఖాళీగా ఉన్నాయి
అవి మౌనంగా ఉన్నాయి
ఒకదాన్నొకటి
తేరిపార చూసుకొని
భోరున విలపించాయి

2.

**పదాలు** – Words

అతను మాట్లాడిన మాటలు
కుర్చీలపైన, మంచాలమీద,
బీరువాలలో, గోడలపైనా ఉండిపోయాయి.
ఇల్లు సర్దటానికి
ఫర్నిచర్, గిన్నెలు, గోడలు
శుభ్రం చేయటానికీ
ఒక పనిపిల్లను తీసుకువచ్చారు
గోడలకు సున్నం
ఇంట్లోకి కొత్తగొంతుకల్ని
తీసుకొచ్చారు
అయినా అతని పదాలు
ఇంకా వినిపిస్తూనే ఉన్నాయి.

3.

**దళం** – Leaf

వారు అతన్ని మౌనంగా మోసుకొని
అతని స్నేహితులు శయనిస్తున్న
విశాలమైన మైదానంలోకి తీసుకెళ్లారు
అక్కడన్నీ శిలువలూ, సమాధిఫలకాలు
"నేను తిరిగి వస్తాను, తాళం చెవి
పూల కుండీ క్రింద ఉంది" అన్నాడతను
ఆ పువ్వుకి చెందిన ఒక రేక
అతని చేతిలో ఇంకా ఉంది.

4.

**ఒక చెట్టు** – A Tree

రెండడుగులు ముందుకు వేసి
అతను నిన్నపాతిన మొక్కను తాకాడు

వేలికొసలనుండి అతని రక్తం
మొక్క పసరులోకి ప్రవహించింది

అతని మనసులో ఉన్న పత్రాలు
కొమ్మలపై మొలిచాయి
వెనుతిరుగుదామని ప్రయత్నిస్తే
అతనెక్కడ నిలబడ్డాడో అక్కడే ఉండిపోయాడు
అతని కాళ్ళు వేర్లుగా మారిపోయాయి

.

5.

**అలసిన ప్రజ** – Exhausted People

అలసిన ప్రజలు బజారులో కూర్చొని
మెత్తని గాలులను వింటున్నారు
బహుసా అవి
దారితప్పిన బాటసారులవో లేక
రోడ్డుపక్క వ్యాపారం సాగించే వారివో
అలసిన ప్రజలు కలుసుకొనే ప్రదేశం అది

అక్కడ పరిచిన రాళ్ళు మానవలక్షణాల్ని పొందాయి
ఎవర్తైనా కనిపించకపోతే వారికోసం అవి ఏడుస్తాయి
అలసిన ప్రజలు బజారులో ఉన్నారు.

రోజురోజుకూ వారి మొఖాలు పెళుసుగా
వారి జుట్టు సాయింత్రపు బలహీనకాంతిలో
మెత్తగా మారుతోంది.
ఒకరినొకరు చూసుకొని
తాము గాజు బొమ్మలమని అనుకొన్న మరుక్షణం
వారి కళ్ళు పెళుసుగామారి
ముక్కలు ముక్కలుగా పగిలిపోయాయి.

6.

**జీవితం** – Life

కాలక్షేపానికి
అతను ఒక కూజాను చిత్రించాడు.
కూజాలో ఒక పూవును గీసాడు
పేపరునుండి పరిమళం పైకిలేచింది
ఒక నీళ్ళ జగ్గును చిత్రించాడు
కొంచెం నీరు తాగి
మరికొంత కూజాలో పూవుపై చల్లాడు
ఒక గదిని, ఒక మంచాన్ని చిత్రించాడు
దానిపై నిద్రపోయాడు
నిద్రలేచిన తరువాత
లోతుఅందని ఒక సముద్రాన్ని చిత్రించాడు
అది అతన్ని ఈడ్చుకుపోయింది.

7.

**అక్కడి జీవితం** – Life There

అక్కడ తన బిడ్డను పూడ్చి
అతని పక్కనే తనూ పరుండటానికి
చాన్నాళ్ళు ఎదురుచూసింది ఆమె.

చివరకు
వారామెను అదే మట్టిలోకి దించారు.
అక్కడ ఆమెకు ఒకరోజు వయసుమాత్రమే
ఆమె బిడ్డ మాత్రం
ముసలివాడయిపోయాడు

8.

**రాత్రి ఆపద** -- Night Visit

వాళ్లు తమ పిల్లలతో
మొక్కలను కాపాడే దేవత గురించి
ఉదయాన్నే కిటికీవద్దనున్న
మల్బరీ చెట్టుపై వాలి
పాటలు పాడే కోయిల గురించి
రేపు ద్రాక్షలు అమ్మి కొనబోతున్న
కొత్తబట్టల గురించి మాట్లాడుకొంటున్నారు.

పిల్లలు నిద్రలేచాకా వారి తలగడల క్రింద
కనుక్కోబోతున్న ప్రత్యేక ఆశ్చర్యాల
గురించి కూడా మాట్లాడుకొన్నారు
కానీ కొంతమంది సాయుధులు వచ్చి
వారి కథలను ముగింపచేసి
గోడలపై ఎర్రని మరకలు చిందించి
వెళ్లిపోయారు.

9.

**వలస పోవటం** Migration by Wadih Saadeh

వాళ్లు వెళిపోయేటపుడు ఇంటికి తాళం వెయ్యలేదు
వీధి కుక్కకోసం, పక్షులకోసం తొట్టెలో నీళ్ళు నింపిఉంచారు,
డైనింగ్ టేబుల్ పై బ్రెడ్డు, కూజానిండా నీళ్ళు ఇంకా
నిల్వచేసిన చేపల టిన్నూ వదిలి వెళ్లారు.
వెళ్ళేముందు వాళ్ళేమీ మాట్లాడలేదు
అయితే వారి నిశ్శబ్దమే ఒక ఒప్పందం
తలుపుతో, కూజాతో, టేబుల్ పై బ్రెడ్డుతో.
వారి పాదముద్రల్ని స్పర్శించే
ఒకే ఒక దయామయి కాలిబాట
ఆ తరువాతెప్పుడూ వారిని చూడలేదు
ఎంతప్రయత్నించినా.

ఒకరోజు ఉదయంనుంచి సాయింత్రం వరకూ
గోధుమ బస్తాల్ని మోసీమోసీ అలసిపోయిన ఆ బాట
వారు తమ చోటును గోడలలో విడిచి వెళ్ళటం గమనించింది.
కొన్ని చేపలు రెక్కలుఆడిస్తూ ఏవో అదృశ్యతీరాలకు
ఈదుకొంటూపోవటాన్ని సముద్రం గుర్తుచేసుకొంది.

ఒక వీధికుక్క ప్రతీ సాయింత్రమూ వచ్చి
వారి ఇంటిముందు అరుస్తూండేదని
ఆ వూరిలోనే ఉండిపోయిన కొంతమంది
చాలాకాలం చెప్పుకొన్నారు.

## కొత్త డైరీ నుంచి ఒక పేజీ by Nida Fazli



కాగితపు కాలెండరులో మాత్రమే
తారీఖు మారింది

స్టీలు బెల్టు డయల్ లో కాలం
ముందుకు కదిలింది
బొమ్మ గడియారంలోని
బొమ్మ తన ఇంటిని దాటుకొని
బయటకు వచ్చి
గుండ్రంగా తిరుగుతూ నృత్యం చేసింది
చప్పట్లు నవ్వులు
దృశ్యాన్ని అలంకరించాయి
గెంతులేస్తున్న జింకపిల్ల
ఆయాసపడుతూ ఆఖరి బస్సు
నల్లటైర్ల క్రిందకు త్రుళ్ళిపడి
ముక్కలు ముక్కలుగా పగిలిపోయింది

నేను ఏదైతే భయపడ్డానో
సరిగ్గా అదే జరిగింది ఈరోజు
ఈరోజు కూడా మళ్ళీ అదే.
అంతే అంతకు మించేం జరగలేదు.

A page from the New Diary by Nida Fazli

From urdu to English by Baidar Bakht

## అనేక పనుల మధ్య ---- by Tadeusz Rosewicz



ఖాళీ చిక్కని
అనేక పనుల మధ్య
నేను మర్చేపోయాను
చనిపోతూ ఉండటం కూడా
తప్పనిసరి అని.

భలే చిత్రంగా
ఈ బాధ్యతను విస్మరించాను
లేదా పైపైన నిర్వహిస్తున్నాను.

రేపట్నుంచి
అంతా సర్దుకొంటుంది
తెలివిగా, ఆశావహంగా, శ్రద్ధగా
మరణించటం మొదలుపెడతాను
సమయాన్ని వృధా చేయకుండా.

"Among Many Tasks" by Tadeusz Rosewicz

## సలాములు Salutations by Shanmukha Subbaih




చిన్నప్పుడు బుర్రమీసాలు, కోరమీసాలతో చాలామంది వ్యక్తులు కనిపించేవారు. రాజసానికో, ఆత్మవిశ్వాసానికో ప్రతీకగా ఉండేవి పైకితిప్పిన మీసాలు. ఇప్పుడు కోర మీసాలు కలిగిఉండటం వాటిని మేలేసుకొంటూ తిరగటం వంటివి పురా జ్ఞాపకాలు

మీసానికీ పౌరుషానికి ఉన్న కల్చరల్ లింక్ తెగిపోయింది. బహుసా దీనికి కారణం మారిన అభిరుచులకంటే కూడా మెజారిటీ ప్రజలు స్వావలంబనను కోల్పోయి ఎవరో చేతికింద ఉద్యోగిగా బ్రతకాల్సిన ఆధునిక జీవనమేమోనని అనిపిస్తూంటుంది.

అజంతా కవిత్వంలో కనిపించే భీతావహత్వానికి ఆధునిక నగరజీవనమే ఆలంబన. అతివినయం అదనపు చేరిక.

జీవితాన్ని ఇలాకూడా నిర్వచించవచ్చా అని ఆశ్చర్యం కలిగించింది ఈ కవిత.

**సలాములు**

అవును అవును
నిజానికి నేను అదృష్టవంతుడిని
దేవుని దయవల్ల
నాకిద్దరు పిల్లలు
ఆశ్చర్యంగా
ఇద్దరూ అబ్బాయిలే

ఇంకా
నాకు కీళ్ళనొప్పులు
నా భార్య రోగిష్టిది
పెద్దాడికి పాపం
ఎప్పుడూ ఏదో నలత
చిన్నాడు ప్రస్తుతానికి
పరవాలేదు
కానీ రేపెలా ఉంటాడో
ఎవరికి తెలుసు?

నేను గుమస్తాని
ఇవి చాలా?
ఇంకా వివరాలేమైనా
కావాలా?

(Salutations by Shanmukha Subbaih)
(Translated from Tamil by T.K. Doraiswamy)

## అనుకరణ -- by Palestinian poet Fady Joudah



చిన్నపిల్లలతో సంభాషిస్తున్నట్లు చెప్పే కవిత్వం పైకి సరళంగా కన్పిస్తున్నా లోతైన అర్థాల్ని పొదువుకొని ఉంటుంది. ఇలాంటి కవితలలో మనం మరచిపోతున్న మానవత్వాన్ని చిన్నపిల్లల ప్రశ్నల ద్వారా లేదా పనుల ద్వారా మన ముందుంచుతాడు కవి. చాలా గడుసుగా మనల్ని దోషుల్ని చేస్తాడు. అదొక మంచి కవిత్వసంవిధానం.

Fady Joudah పాలెస్తీనాకు చెందినవాడు కనుక ఇదేదో పాలెస్తీనా నిర్వాసితుల గొడవలా అనిపించినా, మనప్రభువులు చేస్తున్న అశ్వమేధయాగం లాంటి భూసేకరణల నిర్వాసితులకూ వర్తించే ఒక సార్వజనీన అంశం కూడా. కాలానికి, ప్రాంతానికి అతీతంగా ఉండటం గొప్పకవిత్వ లక్షణం కాదూ?

**అనుకరణ**

తన సైకిల్ హేండిల్స్ మధ్య
గూడుకట్టుకొన్నసాలెపురుగుని
రెండువారాలుగా
అదిలించ లేదు మా అమ్మాయి
దానంతట అదే వెళిపోయే వరకూ
ఎదురుచూసింది.
నీవు దాని గూటిని తొలగించి ఉన్నట్లయితే
అది తెలుసుకొనేది కదా "ఈ ప్రదేశం తన ఇల్లు కాదని;
నీవూ చక్కగా సైకిల్ తొక్కుకొని ఉండేదానవు" అన్నాను నేను

మనచుట్టూ ఎంతోమంది
నిరాశ్రయులు అవుతున్నది అలానే కదూ?'
అంది మా అమ్మాయి.

Mimesis  by Palestinian poet Fady Joudah

## ఆశిష్ ఠాకుర్ కవిత్వం - కొన్ని అనువాదాలు



గతనెల అంతర్జాల సంతలో తప్పిపోయి "ఆశిష్ ఠాకుర్" అనే ఓ కలల వ్యాపారికి బంధీగా ఉండిపోయాను కొంతకాలం. ఆ కబంధ హస్తాలనుంచి బయటపడటానికి చాలా రోజులు పట్టింది.

కవిత్వం పట్ల ఆశిష్ ఠాకుర్ కి ఉన్న అభిప్రాయాలు నిశ్చితమైనవి. ఈ కవితలో కవిత్వము-సమాజము పట్ల ఇతని దృక్పధం గమనించవచ్చు. కవిత్వమనేది ఎవరో్ని ఉద్ధరించటానికి కాక జీవన సౌందర్యాలను, అనుభవాలను అక్షరీకరించటానికి అని సూటిగా స్పష్టంగా చెపుతాడు ఈ కవితలో

1.

**మనకు కావలసిందల్లా!**

అతను అనుకొంటాడు
తన కవితలకు ప్రపంచాన్ని మార్చగలిగే శక్తి ఉందని
యుగాంతం వరకూ అవి శ్వాసిస్తూ ఉండగలవని

కానీ వాస్తవమేమిటంటే
యావత్ ప్రపంచం కూడా
మార్పు తేవాలి, కాలాన్ని బంధించాలి అనే కోర్కెతో
ఇప్పటికే పొట్టపగిలేట్టు ఉంది

మనకు కావలసిందల్లా
సబ్బు నీటిబుడగలో ఇంద్రధనసును దర్శించే కళ.
(All We Need!)

2.

**Sex?**

నువ్వన్నావూ
"నా దేహం చాలా ఆకలితో ఉంది
దాన్ని తినాలని ఉంది" అని
అలాగే, కలిసి తిందాం.
నేనన్నానూ
"నా ఆత్మ చాలా దాహంతో ఉంది
దాన్ని తాగాలని ఉంది" అని
అలాగే, కలిసి తాగుదాం. (Sex? )

మనపూర్వీకులు ఆహార,నిద్రా, మైధునాలను జీవలక్షణాలుగా నిర్వచించారు. ఆ మూడో లక్షణం పరస్పరసమ్మతితో ఉండాలి తప్ప ఏకపక్ష క్రియగా ఉండకూడదన్న చిన్నవిషయాన్ని అద్భుతంగా ఇముడ్చుకొందీ ఈ కవిత. అంతే కాక ఆ క్రియ దేహాత్మల కలయిక అని చెపుతుంది.

## ఆమె మృధువైన చర్మాన్ని కోరుకోవటం లేదు

అనుక్షణం భయపడే ఉడతలా బతికే ఆమె
ఓ పేదదేశానికి చెందిన అమ్మాయి
సురక్షితంగా ఉండటానికి
ఆమెకు ఒంటినిండా రోమాలు కావాలి.

ప్రతీచోటా
గెట్టోలు, గులాగ్ లు, కాన్సంట్రేషన్ కాంపులు.
మారువేషమేసుకొన్న ఆమ్లం మరుగుతూంటుంది వేడి టీ గా
ఆమె పరువు ఆమె మౌనం లో ఉంటుంది
సగర్వంగా నడవటానికి ఆమె తలదించుకోవాలి.
గెంతటం నిషేదింపబడిన జింకపిల్ల ఆమె
ఆమెకు స్వేచ్ఛా శృంఖలాలను
బహూకరించాయి తోడేళ్లు
అంతే కాదు
వీధులనిండా పోస్టర్లు
“ఆడ టెర్రరిస్టు కావలెను... ప్రాణాలతో లేదా శవంగానైనా
ఆమె అనాచ్చాదిత చేతులపై, నగ్న పాదాలపై
కోర్కెలు రేకెత్తించే ప్రేలుడు పదార్థాలతో తిరుగుతుంది”.. అంటో
She doesn't want smooth skin

కవిచుట్టూ ఉండే సమాజంలో అంతా సౌందర్యమే ఉండదు. ఒక్కోసారి భీతావహ పరిస్థితులు గగుర్పాటు కలిగిస్తాయి. ఆశిష్ ఠాకుర్ కూడా నేడు సమాజంలో స్త్రీలపై జరుగుతున్న క్రూరత్వాలను ఈ కవితలో వర్ణించిన తీరు చూస్తే ఒక విధమైన జలదరింపు కలుగక మానదు.

ఓ అమ్మాయికి పట్టులాంటి మృధువైన చర్మం అక్కర్లేదట, ఒళ్ళంతా రోమాలు మొలవాలని కోరుకొంటోంది- అంటూ మొదలౌతుంది ఈ కవిత. ఒంటినిండా దుస్తులు వేసుకొన్నా అనాచ్చాదితంగా ఉన్న అరచేతులు, పాదాలు మగవారిలో కోర్కెలు రేకెత్తిస్తున్నాయి అనటం, అటువంటి అమ్మాయిని ఒక టెర్రరిస్టుతో పోల్చటం వంటివి-- ఒకరకంగా ఈ కవితను తారాస్థాయికి తీసుకెళ్ళి వదలటమే. ఈ కవితలో గొప్ప శిల్పం, లోతైన పదచిత్రాలు, అద్భుతమైన తర్కం ఉత్తమ స్థాయిలో వ్యక్తీకరింపబడ్డాయి.

3.

**వేసవి**

వేసవి ఉంది
పిచ్చుకలు లేవు
నాలో
వేసవేల ఎండిన చేతివేళ్లతో
ఓ చెట్టు
హృదయం ఒక ఏకాకి శిఖరం
నేత్రాలు ఒక ఎండిన చెలమ
లోనికి తెరచుకొనే కిటికీలు
ఇంకా
సూర్యునిచే కాల్చబడిన ఆకాశం
ఓ దాహమెత్తిన నుయ్యి
చెప్పటానికి ఏమీ లేదు
ఉత్త ఎండు కవితలు
వానకోసం ఎదురుచూస్తూ
(Summer)

కవిత్వంలో ఉద్వేగాల్ని పలికించటం చాలా క్లిష్టమైన పని. ఈ కవితచదివినపుడు ఒక ఎడారితనం, నిరీహత, దాహం, రసహీనత వంటి అనేక భావాలు ముప్పిరిగొనుపుతాయి. ఎండిన ఆకులను ఎండిన చేతివేళ్ళుగా వర్ణించటం మొత్తం కవితను ఒక అనార్థలోకానికి తీసుకుపోతుంది.

4.

**రాత్రి**

నీ పేరుని పలకలేని
నా హృదయ స్పందనల్లా
మౌనంగా ఉందీ రాత్రి
నా కళ్ళకు శత్రువైన అద్దంలా
మౌనంగా ఉందీ రాత్రి
ఆశలకన్నా సుదీర్ఘంగా ఉండే
ఒంటరితనాన్ని మోసే అమ్మలాగే
ఈ రాత్రి ఏనాడూ నవ్వదు

ఓ రాత్రీ!
నా స్నేహితునిగా ఉండవా
నేను ఇప్పటికే పగలుని కోల్పోయాను.

Night

5.

**విశ్వం కన్నా పెద్దదైన చిన్న కవిత**

రెండు పదాల మధ్య దూరం
ఓ లక్ష సంవత్సరాల కన్న ఎక్కువ ఉండొచ్చు
కానీ
గుండెకు గొంతుకు మధ్య ఉండే
దూరం కన్నా తక్కువ ఉండాలి
ఒక వాక్యం పొడుగులో
సముద్రాలు ఇమిడిపోవచ్చు
కానీ
దాని లోతు మాత్రం
పచ్చని గడ్డిపోచ ఎత్తుకన్నా తక్కువుండాలి. .....

A short poem bigger than the universe

కవిత్వలక్షణాల్ని అనేకమంది కవులు అనేక రకాలుగా తమ కవిత్వంలో పొందుపరచారు. కవిత్వానికి "నిజాయితీ", "స్పష్టతతో నేలమీదే ఉండటం" అనే లక్షణాలు ఎంత అవసరమో రెండే రెండు అద్భుతపదచిత్రాలలో పట్టిచూపుతాడు ఆశిష్ ఠాకుర్ ఈ కవితలో..

6.

**గదిమూలలు ఖాళీగా ఉంచాలి**

ఎందుకంటే
ఒక గోడ మరోక గోడకు ముద్దులెలా పంపిస్తుందో చూడొచ్చు
వాటి అన్యోన్య ప్రేమ వల్లే
మన తలలమీద ఇంటి పైకప్పులు నిలిచి ఉన్నాయి.
ఖాళీగా ఉంచిన గది మూలలో
సాలీడు గూడు కట్టుకోవటానికి వీలవుతుంది
మనమందరం ఒకరితో ఒకరం కలపబడి ఉన్నామన్న విషయం
ఆ సాలె గూడు గుర్తు చేస్తూంటుంది.
గాయపడ్డ ఆశలకు మూలలే ఆశ్రయమిస్తాయి

వాళ్ళంటారూ
మన హృదయాలలో కూడా మూలల్ని ఖాళీగా ఉంచమని
ఎందుకంటే
ప్రపంచాన్ని జయించగలిగే ప్రేమకు కూడా
ఎదగటానికి కాస్త చోటు కావాలి మొదట్లో ...

Corners should be kept empty

తాత్వికత కవిత్వానికి కొత్త అందాలు తెస్తుంది. కొత్తలోతుల్ని తెచ్చిపెడుతుంది. కొత్త అర్థాల్ని ఇస్తుంది. కానీ ఇదంతా తేటగా అందుతూ ఉండాలి. చదువరికి అర్థంకానంత అస్పష్టత కవితలోకి చొరబడకూడదు. అందుకు ఒక మార్గం మూర్తపదచిత్రాలను ఎంచుకోవటం. మూర్తపదచిత్రాలతో ఎంతటి అమూర్తభావననైనా కళాత్మకంగా చెప్పటానికి వీలవుతుంది. పై కవిత ఆ టెక్నిక్ కు చక్కని ఉదాహరణగా నిలుస్తుంది.

ఆశిష్ ఠాకుర్ కవిత్వం గురించి మాట్లాడుతూ, "వైద్యం, వ్యాపారం, ఇంజనీరింగ్ వంటి గొప్ప విద్యలు ప్రాణాల్ని నిలపటానికి అవసరం అయినప్పటికీ, మనం బ్రతికేది మాత్రం కవిత్వం, సౌందర్యం, ప్రేమ, కాల్పనికతల కోసమే" అంటాడు. గొప్ప స్వాప్నికుడు మాత్రమే అనగలిగే మాటలు. అంతే కాదు ఇతని కవిత్వంలో ఈ తత్వం ఒక అంతర్జలలా ప్రవహిస్తూంటుంది. చక్కని అభివ్యక్తి, అపూర్వ కల్పనా చాతుర్యము, ఉత్కృష్టమైన ఇంటిలిజెంట్ ప్లే ఇతని కవిత్వాన్ని మహిమాన్వితం చేస్తాయి, Top Class Poetry గా నిలుపుతాయి.

## కవితను ముగించాకా..... by Wu Pen (779-841 AD)

ఆ రెండు వాక్యాలకై
మూడేళ్ళు వెచ్చించాను.
మరోసారి వాటిని చదివా,
రెండు కన్నీటి బొట్లు
జల జలా రాలాయి మరలా

మిత్రమా,
అవి నీకు నచ్చకపోతే
నేను ఇక ఇంటికి పోయి
అనాది కొండలపై తిరుగాడే
శరత్తులో శయనిస్తాను.

Wu Pen (779-841 AD)

## ఆశావాది – నజీమ్ హిక్మత్



అతను చిన్నప్పుడు
తూనీగల రెక్కలని తెంచలేదు
రేకు డబ్బాల్ని పిల్లుల తోకలకు కట్టలేదు
మిణుగురుల్ని అగ్గిపెట్టెల్లో బంధించనూలేదు
చీమలపుట్టల్ని ఏనాడూ నేలకూల్చలేదు.
అయినప్పటికీ  పెద్దయ్యాకా
అవన్నీ అతనికి జరిగాయి.

అతను చనిపోయేటపుడు పక్కనే ఉన్నాను
నన్ను కవిత్వం చదవమన్నాడు
సూర్యుడి గురించి, సముద్రం గురించి
అణురియాక్టర్ల గురించి, సాటిలైట్ల గురించి
మానవత్వపు తేజస్సు గురించి.

Optimistic Man – Nazim Hikmet

## 21 April 1924 – From Gioconda's diary by Nazim Hikmet

ఈ రోజు నా చైనా మిత్రుడు
నా కళ్ళలోకి సూటిగా చూస్తూ అడిగాడు;

"మా పంటపొలాల్ని
యుద్ధ టాంకులతో తొక్కించి
మా నగరాలపై పడి
యమకింకరుల్లా ప్రవర్తించే
వాళ్లు నీ జాతా
మిమ్మల్ని ఎవరు పుట్టించారు?

చేతులూపుతూ కాదన్నాను
కాదు కాదంటూ భోరున ఏడ్చాను.

## అడవికి ఒక లేఖ – Pablo Neruda

వానని, చల్లని గాలుల్ని నేను పోగొట్టుకొన్నాను
ఏం సంపాదించుకొన్నానో తెలియటం లేదు
చెట్టునీడను కోల్పోయాకా
ఒక్కోసారి నాలోకి నేనే కూరుకుపోయి మరణిస్తూంటాను:

నా హృదయం ఆనందంగా లేదు
నేను ఖర్చుపెట్టేసిన, చేజార్చుకొన్న వాటికోసం
నా చెప్పుల క్రింద వెతుకుతూంది.
నేల శోకం నాలోకి ఓ ఓడలా కదులుతుంది.
కొత్త గ్రహాలను అన్వేషిస్తాను నేను.
వానలు నన్ను పూర్తిగా మరచిపోయాయి

A Letter Requesting Wood Pablo Neruda

## పాబ్లో నెరుడా- బుక్ ఆఫ్ క్వశ్చన్స్ —The Book of Questions by Pablo Neruda



సెప్టెంబరు 1973 లో పాబ్లో నెరుడా చనిపోవటానికి కొద్దినెలల ముందు The Book of Questions పుస్తకాన్ని పూర్తిచేసాడు. విలియం ఓడెలి అనువాదంచేసిన ఈ పుస్తకం నెరుడా మరణానంతరం వచ్చింది.

దీనిలో చిన్ని చిన్ని కవితలు ప్రశ్నలరూపంలో ఉంటాయి. ఒక అనుభవం, దాని తాలూకు ఉద్వేగం వీటి లక్షణాలు. నెరుడా అప్పటికే గొప్పసాహిత్యాన్ని సృష్టించాడు భిన్న కళాత్మక, రాజకీయ ఆలోచనా సారాలలోతుల్ని తరచిచూసి పండిపోయిన కవి.

The Book of Questions లో ఈ లోకంపట్ల ఒక శిశువు ఆశ్చర్యాన్ని, పెద్దవాళ్ల తర్కాన్ని ఎదురెదురుగా నిలబెడ్తాడు. ఇవి మొత్తం 316 ప్రశ్నలు. 74 పేరులేని ఖండికలుగా ఉంటాయి. కొన్ని ప్రశ్నలకు తార్కిక సమాధానాలు దొరకవు.

నదులన్నీ తీయగా ఉన్నప్పుడు
సముద్రం ఉప్పుని ఎక్కడనుంచి తెచ్చుకొంది?

పై ప్రశ్నలో నదులు, తీయదనం, సముద్రము, ఉప్పు లాంటి పదాలకు వాటి నైఘంటికార్థాలు కాక ఏదో తెలియని కొత్త అర్థాల్ని పొందుతాయి. ఆలోచింపచేస్తాయి. ప్రజలందరూ ప్రేమాస్పదులుగా ఉంటున్నప్పుడు ప్రజాస్వామ్యం క్రూరంగా ఎందుకుంటున్నదీ అని పై ప్రశ్నకు చేసే అన్వయం ఔచిత్యభంగం కాబోదు.

ఈ పుస్తకంలో నెరుడా ఊహాలోకపు అంచుల్ని తాకుతాడు. ఇలాకూడా ఊహించవచ్చా అని విస్మయపరుస్తాడు. హృదయాన్ని, బుద్దిని జోడుగుర్రాలుగా నడిపించి గొప్ప విభ్రమాత్మక వాక్యాలను సృష్టిస్తాడు.

ఈ పుస్తకంలో నెరుడాని ఒక రాజకీయ కవిగానో, ప్రేమకవిగానో, ప్రకృతి కవిగానో, పశ్చాత్తాప కవిగానో చూడలేం. "నాలోనే అనేకులు ఉన్నారు" అని ఓ కవితలో అన్నట్లు జీవితంలోని అనేకతను, చీకటి వెలుగుల్ని కవిత్వంలో నింపిన కవి నెరుడా.

నెరుడా తనలోని వైరుధ్యాల పట్ల ఎరుకను కలిగి ఉన్నాడు. వాటిని యథాతథంగా స్వీకరించాడు. మానవజీవితం క్షణక్షణం మనముందు పరిచే అన్ని అనుభవాలకూ స్పందించాడు. ఇరుకు దారులనుంచి, ప్రమాదకరమైన సరళీకరణలనుంచీ, సిద్ధాంతాలనుంచీ, అహంకారంనిండిన ఆత్మస్తుతినుంచీ తన కవిత్వాన్ని విముక్తం చేసాడు. జీవితాన్ని పెనవేసుకొనే మానవానుభూతులకు కలకాలం నిలిచే కళాత్మక రూపాన్ని ఇచ్చాడు.

(పాబ్లోనెరుడా సృష్టించిన మహావిస్తృతమైన ఆ కళాత్మకరూపం ఈరోజు మొత్తం మూడువేల పేజీల చిక్కని కవిత్వ రూపంలో మనముందు ఉంది)

The Book of Questions లోని మొత్తం 316 ప్రశ్నలలో నాకు నచ్చిన వాటి అనువాదాలు ఇవి.

1.
స్వర్గంలో ఎన్ని చర్చిలు ఉంటాయి?
2.
రాత్రి టోపీకి
అన్ని చిల్లులెందుకున్నాయి?
3.
ఏ కలతచెంది అగ్నిపర్వతాలు
జ్వాలల్ని, ఉగ్రతను, ఉదాసీనతను చిమ్ముతాయి?
4.
బయటపడని కన్నీటిచుక్కలు
చిన్నచిన్న తటాకాలలో ఎదురుచూస్తుంటాయా?
లేక అవి అదృశ్య నదులుగా విషాదం వైపు ప్రవహిస్తుంటాయా?
5.
ఈ ఉదయించిన సూర్యబింబం నిన్నటిదేనా?
లేక ఈ తేజస్సు ఆ తేజస్సు కన్నా భిన్నమైనదా?
6.
ఇంతకీ నవంబరు వయసు ఎంత?
7.
రాతియుగం మనుషులు
కనిపించని సిరాతో ఎందుకు వ్రాసుకొన్నారు?
8.
దోమలు, సాహిత్యరక్షకభటులు
నన్నెందుకు కుడతాయి?
9.
నారింజ చెట్టులోని సూర్యకాంతిని
నారింజలు ఎలా పంచుకొంటాయి?

10

దానిమ్మ గింజల రసంతో

ఎర్రని కెంపులు ఏం చెప్పాయి?

11.

శుక్రవారం తరువాత వద్దాములే అని

గురువారం ఎందుకు ఆలోచించుకోదు?

12

పిట్టనుండి పిట్టకు ఎగురుకుంటూ తిరిగే

పువ్వుని ఏమని పిలుస్తారు?

13

సముద్ర మధ్యభాగం ఎక్కడుంటుంది?

అలలు అక్కడికి ఎందుకు వెళ్లవు?

14

4 అందరికీ 4 గేనా

అన్ని ఏడులు సమానమేనా?

15

కలల్లో మోగే గంట

నీకెక్కడ దొరుకుతుందీ?

16

దుఃఖం దళసరిగాను

మనోవ్యధ తాటగాను ఉంటుందంటారు నిజమేనా?

17

ధనవంతులు తమ స్వప్నాలను

బంగారు పెట్టెలలో భద్రపరచుకొంటారా?

18.

నా ఎముకలు చిలీలో నివసిస్తూంటే

నేనెందుకు అక్కడనుంచి వలసవెళ్ళాలని అనుకొన్నాను?

19

చెగువెరా రాత్రి తరువాత

బొలివియాలో ఎందుకు ఉదయం రాలేదు?

20

చెట్టు ఆకాసంతో మాట్లాడటానికి

భూమి నుంచి ఏ భాష నేర్చుకొందీ?

21

ఇంద్రధనసు ఎక్కడ అదృశ్యమౌతుంది

నీ హృదయంలోనా, దిగంతాలలోనా?

22

స్వప్నాలలోని వస్తువులు ఎక్కడకు వెళ్లిపోతాయి?

ఇతరుల స్వప్నాలలోకా?

23

ఒకప్పుడు నేనొక బాలుడిని . వాడు ఎక్కడ ఉన్నాడు ఇప్పుడు?

నాలోనా లేక వెళ్ళిపోయాడా?

విడిపోవటం కోసమే అయితే మేమిద్దరం అంతకాలం ఎందుకు కలిసున్నాం?

నా బాల్యం చచ్చిపోయాకా మేమిద్దరం ఎందుకు చనిపోలేదు?

24

డిసెంబరు, జనవరిల మధ్య వచ్చే నెల పేరేమిటి?

25

పిచ్చుకలు చంద్రునిపైకి వలసపోతాయన్న వార్తలు నిజమేనా?

అవి వసంతాన్ని వాటితో పాటూ తీసుకుపోతాయా?

26

నేను నిద్రపోతున్నప్పుడు

నాకు బదులు ఎవరు బయటకు వెళ్ళి జీవిస్తారూ?

27

మనం దయను నేర్చుకొంటామా

లేక దయ ముసుగునా?

28

గతించిన కాలాన్ని

ఏ కిటికీలోంచి అలా చూస్తూ ఉండగలనూ?

29

ప్రేమ గురించిన ఆలోచనలు

చల్లారిన అగ్నిపర్వతాలలోకి కూలిపోతాయా?

30

రుతువులకు తమ దుస్తులు మార్చుకోవాలని
ఎలా తెలుస్తుంది?

నవంబరు వయసెంత లాంటి చమత్కార వాక్యాల నుండి స్వర్గంలో ఎన్ని చర్చిలు ఉంటాయి? లాంటి గంభీరమైన అంశాలదాకా ఈ ప్రశ్నలు ఉన్నాయి. ఈ ప్రశ్నలకు వివిధ విమర్శకులు అనేక వ్యాఖ్యానాలు చేసారు. ఉదాహరణకు ఒక శ్రామికుడు నాలుగు గంటల పనిచేస్తే దక్కే ప్రతిఫలం ఒక ధనవంతుడు నాలుగు గంటలు పని చేస్తే వచ్చే ప్రతిఫలంతో సమానం కాదు అనే విషయం 14వ ప్రశ్నచెపుతుందని అంటారు.

ఒక యూదుగాధలో- జీవితానికి అర్థం ఏమిటని కొడుకు తండ్రిని అడిగినపుడు, "ఏదో ఓ జవాబు తెలుసుకొని, అంత గొప్ప ప్రశ్నను ఎందుకు నాశనం చేస్తావు? అని తండ్రి అన్నాడట.

అలా పై ప్రశ్నలకు జవాబులు ఆశించటం, వెతుక్కోవటం నిష్ఫలం. ప్రశ్నను ఆస్వాదించటం, అనుభూతి చెందటం ముఖ్యం ఇక్కడ. బహుసా నెరుడా ఉద్దేశం కూడా అదే కావొచ్చు.

## పురావస్తు తవ్వకాల చోటు వద్ద – by Yahuda Amichai



ఒక పురావస్తు తవ్వకాల చోటు వద్ద
శుభ్రంగా తుడిచి, వరుసలలో పేర్చిన
విలువైన వస్తువుల, పాత్రల శకలాలను చూసాను
ఆ పక్కనే
వ్యర్థమని పారబోసిన ధూళి గుట్ట ఉంది.
దానిపై ముళ్ళ మొక్కలు కూడా మొలవవు
లోతుల్లోంచి తవ్వి, అణువణువూ గాలించి,
హింసించి, వేరుచేసి కుమ్మరించిన

ఈ ధూళి గుట్ట ఏమై ఉంటుందా అని
నాలో నేను తర్కించుకొన్నాను.
సమాధానం దొరికింది
ఈ ధూళి అంతా మనలాంటి ప్రజలే
వెండి, బంగారం, చలువరాయి
ఇంకా విలువైన వస్తువులనుండి
జీవితకాలమంతా దూరం చేయబడి
చనిపోయి నేటికీ ఇంకా ధూళిగానే
మిగిలిపోయిన మనమే
ఈ ధూళి కుప్పే మనం,
మన శరీరాలు,
మన ఆత్మలు
మన నోటి మాటలు
మన అన్ని ఆశలు.

At an Archaelogical Site by Yahuda Amichai

## బాంబు అడ్డుకొలత

బాంబు అడ్డుకొలత ముప్పై సెంటిమీటర్లు
నలుగురు మృతులు, పదకొండుమంది క్షతగాత్రులతో
దాని విస్ఫోటన పరిధి ఏడు మీటర్లు
అది కలిగించిన దుఃఖం రెండు ఆసుపత్రులకు
ఒక స్మశానానికి విస్తరించింది.

పాతిపెట్టబడిన అమ్మాయి
వందకిలోమీటర్ల దూరంలో ఉండే
సిటీ నుండి రావటం వల్ల
ఈ వలయం మరింత పెద్దదయ్యింది.

ఆమె మరణ వార్త విన్న ప్రియుడు ఎక్కడో మరో దేశంలో
ఒంటరిగా విలపిస్తూండటంతో
ఈ వలయంలోకి మొత్తం ప్రపంచమే వచ్చినట్లయింది

దేవుని సింహాసనం వరకూ
ఇంకా దాన్ని దాటికూడా ప్రతిధ్వనించే
అనాధల ఆక్రందనలను ఈ వలయంలో చేర్చలేదు
అపుడీ వలయానికి అంతమూ ఉండదు
అందులో దేవుడూ ఉండడు.

Source: The Diameter of the Bomb by Yahuda Amichai

## Amichai Yahuda

ఒక్కోసారి
చీము
ఒక్కోసారి కవిత్వము
ఏదో ఒకటి ఉబుకుతుంది
ప్రతీ సారి నొప్పి

Amichai Yahuda

## నిశ్శబ్దం పై జలాలుద్దీన్ రూమీ (1207 – 1273)

1

పదాలింక చాలు మిత్రమా

చెవులను చూడనియ్యి,

నీ మిగతా కవితను

ఆ భాషలో మాట్లాడించు

2.

ఈ కవిత నిడివి తగ్గిస్తాను

ఎందుకంటే

అదంతా ఈ ప్రపంచంలో

మన కళ్ళముందు కనిపిస్తూనే ఉంది.

3.

ఈ నిశ్శబ్దాన్ని గుర్తించావా?

అది నువ్వు నీ గదిలో ఒంటరిగా

మాట్లాడటానికి ఎవరూ లేనప్పటి

నిశ్శబ్దం లాంటిది కాదు.

4.

ఇది స్వచ్ఛమైన నిశ్శబ్దం

ఇది

బ్రతికున్న కుక్కలు చచ్చిన కుక్కను

పీక్కు తింటున్నప్పటి నిశ్శబ్దం కాదు.

5.

నిర్మలమైన ఖాళీగా మారు

అందులో ఏముంటుంది? అని నువ్వు అడిగితే

నిశ్శబ్దం మాత్రమే అని చెప్పగలను.

6.

నిశ్శబ్దం

నువ్వు సాధన చేయాల్సిన కళ

Source: జలాలుద్దీన్ రూమీ

## తుపాకి మాట్లాడితే – జీన్ అరసనాయగం కవిత్వం

**చరిత్రను రికార్డు చేయటం కూడా కవిత్వానికి బాధ్యతే.**

ప్రశాంతతలో జ్ఞాపకం చేసుకొనే ఉద్వేగాలలోంచి కవిత్వం పుడుతుందన్న వర్డ్స్ వర్త్ మాట – నిత్యం జాతి వివక్షతో ప్రజలు సామూహిక ఊచకోతకు బలి అయ్యే సందర్భాలలో వర్తించదనే విషయం, జీన్ అరసనాయగం బ్లాక్ జులై గురించి వ్రాసిన Apocalypse 83 సంపుటిలోని కవిత్వం చదివితే అర్ధమౌతుంది.

శ్రీలంకలో తమిళులపై జులై, 1983 లో జరిగిన మూక దాడులను 'బ్లాక్ జులై' అంటున్నారు చరిత్రకారులు. ఈ దాడులలో దాదాపు మూడువేలమంది ప్రాణాలు కోల్పోయారు. తమిళులకు చెందిన సుమారు ఎనిమిదివేల ఇళ్ళను, ఆరువేలకుపైగా షాపులను తగలబెట్టారు. లక్షా యాభైవేలమంది నిర్వాసితులయ్యారు. ఇదంతా చరిత్ర. చరిత్రపుస్తకాలలో పైన చెప్పిన తారీఖులు, లెక్కలు, కారణాలు మాత్రమే ఉంటాయి. ఆనాటి బాధితుల మనోద్వేగాలు, హంతకుల ఉన్మత్తత, తటస్థుల ప్రవర్తన లాంటివి ఒక్క కవిత్వంలో మాత్రమే లభిస్తాయి. జీన్ అరసనాయగం ఆ దాడులలో ఒక బాధితురాలు కనుక అవన్నీ ఆమె కవిత్వంలో ప్రతిబింబించాయి. చివరి వూపిరిదాకా శ్రీలంక వ్యథని కవిత్వం చేస్తూనే వున్న ఆమె ఈ నెలలో కన్నుమూశారు. ఆమెకి నివాళిగా ఈ అనువాదాలు.

ఈ రోజు ప్రపంచవ్యాప్తంగ ఎక్కడ వివక్షతో ఊచకోత జరిగినా అరసనాయగం కవిత్వాన్ని గుర్తుచేసుకొనే పరిస్థితి ఉంది.

**తుపాకి మాట్లాడితే** — If the gun speaks

తుపాకి మట్లాడితే
అంతా నిశ్శబ్దమే
భయం తాలూకు నిశ్శబ్దం
రక్తంతో, బుల్లెట్లతో తుపాకి మాట్లాడితే.
గణేష్ విగ్రహ తొండానికి గుచ్చిన
ఎర్ర మందారం
ఒక రక్తవాంతులా ఉంది
చేతులపై, కాళ్ళవద్దా ఉంచిన
ప్రతీ పువ్వూ
ఒక తెరిచిన గాయం
నల్లూరు ఆలయవీధిలో బంగారు రథాన్ని
తాళ్ళతో లాగుతున్నారు మనుషులు
ఇసుకలో మెల్లగా కదులుతోందది
ఠాప్ మనే శబ్దాలు
ఓ వేయి కొబ్బరికాయలు పగిలుంటాయి
వాటి తీయని నీరు
అనాచ్ఛాదిత దేహాలపై, తలలపై
ప్రవహించింది
తుపాకుల శబ్దాలు నిలచిపోయాకా
అంతా నిశ్శబ్దం
మంటల చిటపటలు
అగ్నిసముద్రంలా వ్యాపించాయి
ఛిద్రమైన బూడిద నేలపై
ఓ వేయి చితులు కాల్తున్నాయి.

(నల్లూరు- ఊరిపేరు. ఇక్కడ పోలీసుల ఫైరింగ్ లో అనేకమంది చనిపోయారు.
అరసనాయకం కవిత్వంలో భక్తిని, మనిషి చేస్తున్న హింసను పారలల్ గా నిలపటం చాలాకవితల్లో కనిపిస్తుంది. నువ్వు సృష్టించిన మానవుడు ఇంత హింసను చేస్తుంటే అసలు నువ్వు ఉన్నావా అని ప్రశ్నిస్తున్నట్లుంటుంది)

2.

**భయం Fear**

గొంతులో భయం అడ్డుపడుతుంది
మాటలు బయటకు రావు
అల్లరి మూకల భయం
రాత్రి భయం
వెలుగు భయం
శత్రువుని చూపించే,
పగలంటే భయం
గజగజ వణుకుతూన్న దేహం మొత్తం
భయంగా మారుతుంది

మంటలు, మంటలు, మంటలు.
మృత్యు దృశ్యాలతో కిక్కిరిసిన నేత్రాలు
జ్వరంతో, దిగ్భ్రమతో
రాయిలా అంధత్వం పొందుతాయి.
నిద్రలో భయం, కలల్లో భయం
మాట్లాడితే భయం
వీధులో నడిస్తే భయం
మనవైపు ఎవరైనా
తేరిపార చూస్తే భయం
ప్రతి చూపులో, భంగిమలో భయం,
అడుగువేయాలంటే భయం
వాళ్ళు మమ్మల్ని చంపటానికి
వస్తున్నారంటే భయం
పారిపోవాలంటే భయం

మోకరిల్లటానికి ఇంకేమాత్రమూ శక్తి లేని దేహంతో
ఇంకా ఇక్కడే ఉంటున్నందుకు
నా ఆత్మలో ఏ కొంతైనా సారం మిగిలి ఉంటుందా?

3.

**శరణార్థి శిబిరం — Refugee camp 1983**

నేను ధరించిన ఒకే బట్ట
అది భరిస్తోన్న నా చమట, మురికి
నాకొక గుర్తింపు, హోదాను ఇస్తోంది
నేనెవరినో నాకు తెలిసింది
నేనెవరితో ఉన్నానో, మాట్లాడుతున్నానో
కలిసి దుఃఖపడుతున్నానో
మా అందరకూ ఒకటే పేరు
-శరణార్థి-

ఈ స్కూలు ఆవరణలో
రెండు చేతులు ముందుకు చాచి
ఈ ప్లేటులో వేయించుకొన్న గుప్పెడు మెతుకులు
నా ఆకలిని శాంతింప చేయొచ్చు
బహుసా నీది కూడా.

ఇదోరకమైన ఆకలి, తొందరగానే తీరుతుంది
ఏ భయము, ఏ అపాయమూ లేకుండా
జీవించాలనే ఆకలి అలా కాదు.
కొన్ని గుడ్డలేవో మడతపెట్టుకొని
తలగడగా చేసుకొని సిమెంటు నేలపై పడుకొంటాను
స్కూలు డెస్క్ లే నా పొలిమేరలు.
సురక్షిత ప్రాంతపు అంచుల్లో ఉండేదాన్ని
తటస్థ భూమి.
లక్షమందో ఇంకా ఎక్కువమందో ప్రజలతో పాటూ
నేనూ నిర్వాసితమయ్యాను
-అందరూ శరణార్థులే-

## Yes and No – Margarita Aligher (Russian Poetess)



నేను మరలా యవ్వనంలోకి వెళ్ళగలిగితే
పదిహేడు ఏళ్ళ వయసూ.... అలా,
ఖచ్చితంగా “కాదు” అని ఉండేదానిని.

ఒకవేళ ఇప్పుడు
నాకు ఇరవై రెండు ఏళ్ల వయసు ఉంటే
సందేహమే లేదు, వెంటనే చెప్పేసే దానిని
“అవును” అని.

ఆ తరువాత జరిగిన సుదీర్ఘ జీవనయానంలో
“అవును” “కాదు” అన్న ఆ రెండు చిన్నమాటలు
ఏనాడూ తగినంత శక్తినివ్వలేదు.
ఏంజరిగిందో చెప్పటానికి
అనుభూతులన్నీ బలహీనంగా ఉన్నాయి.
నన్నేమీ అడగకండి, నేనేమీ మాట్లాడకపోతే
బలవంతం చేయకండి.

## కాశ్మీరీ కవిత్వం 1

కాశ్మీర్ కవులు వెలువరించే కవిత్వం ఇదివరలో చదివాను. పోస్ట్ ఆఫీస్ లో పెన్షన్ కొరకు ఎదురుచూసే ఒక వృద్ధవనిత కవితను అనువదించాలని సేవ్ చేసుకొన్నాను చాన్నాళ్ళ క్రితం. గత రెండురోజులుగా సమకాలీన కాశ్మీరీ కవిత్వం చదువుతున్నాను. నేను చదివిన మేరకు వాళ్ల కవిత్వంలో వేదన, యుద్ధబీభత్సం, హింస, జీవితం పట్ల అభద్రత, శాంతికాముకత కనిపించాయి. వస్తువుని కవిత్వం చేయటం కూడా అద్భుతంగా అనిపించింది. పాత మాటే అయినా వస్తువే శిల్పంగా మారిపోయిన క్రమం తెలుస్తుంది.

మానవోద్వేగాలను కవిత్వం మాత్రమే ప్రకటించగలదన్న విషయం మరోసారి అర్ధమైంది.

నాకు నచ్చిన కొన్ని కవితల అనువాదాలు. (ఇవి తాజాపరిస్థితులకు సంబంధించినవి కావు, పాతవి).

★★★

### Qaisar Bashir

(The Cry of Wounded Souls కవిత్వ సంపుటి నుంచి)



**తంకా – Tanka**

ఆకుల్లేని కొమ్మపై
ఒక కోయిల కూర్చొని
అత్యంత చేదుపాట పాడుతోంది
తన వనాన్ని స్మరించుకొంటూ.
స్వరం పెరిగింది: వెక్కిళ్ళు, కన్నీళ్ళు, వ్యధలు

**Quatrains**

1.

ఆగష్టునెలలో ఒక వానవెలసిన మధ్యాహ్నపు వేళ
ఇంద్రధనస్సు కనిపించింది. దానినుంచి
ఎర్ర సిరాను అడిగి, దుఃఖిస్తూ ఇలా రాసుకొన్నాను
"ఎందుకు మా పిట్టలు (పసితనంలోనే) నేలకూలిపోతున్నాయి?

2.

చాలాకాలంగా నాకు తెలిసిన ఒక గాయకుడు ఇంటికి వచ్చాడు.
మా వాగ్గేయకారుడు Habba Khatoon[2] గీతాలను అతను
దాల్ సరస్సు చినార్ వృక్షాలపై వాలిన బుల్ బుల్ పిట్టలా గానం చేస్తుంటే
వాటిని నేను ఎలా ఆస్వాదించగలనూ? యుద్ధం మధ్యలో!

Qaisar Bashir కాశ్మీర్ యూనివర్సిటీ లో ఎమ్.ఎ. లిటరేచర్ చదివారు. ఉపాధ్యాయ వృత్తిలో ఉన్నారు. కవి అనువాదకుడు.

[2] Habba Khatoon: Habba Khatoon also known as the Nightingale of Kashmir (1554–1609), was an important Kashmiri Muslim poet and ascetic

## యుద్ధం ముగిసాకా … by Shabir Ahmad Mir



యుద్ధం ముగిసాకా
నువ్వు ఇలా వస్తే
బుల్లెట్లు, పెల్లెట్లు చేసిన రంధ్రాలను
నీకు నేను చూపిస్తాను
నీ చేతివేళ్లతో తడిమి చూస్తే
నీకే అర్ధమౌతుంది వాళ్లెంత గాయపరచారో
యుద్ధం ముగిసాకా
శిధిలాల మధ్య భయం భయంగా వికసిస్తోన్న
ప్రిమ్ రోజెస్ పూల వాసన నీకు చూపిస్తాను
ఎంతటి దివ్యసౌందర్యం ఉండేదిక్కడ!
యుద్ధం ముగిసాకా
మా అఖండ పురాతన గిరుల మధ్య ప్రవహించే
సెలయేళ్ల గలగలల్ని నీకు వినిపిస్తాను
వాటి గొంతును కోపోద్రిక్త సరిహద్దుల చప్పుళ్ళు
ఇకపై అణచలేవు.

యుద్ధం ముగిసాకా
నేను నిన్ను దగ్గరుండి తీసుకెల్తాను
వెరినాగ్ నీటి చెలమలో నీ పాదాలను తడుపుకో
సుఖనాగ్ నీటిబుగ్గలోని నీళ్ళు దోసెళ్ళతో తాగు
ఏ భద్రతా లేకుండానే దాల్ సరస్సులో
పడవ షికారు చేస్తూ చేతిని నీళ్ళలో ఆడించు
ఇదెంత ప్రశాంత ప్రదేశమో నీకే తెలుస్తుంది,

యుద్ధం ముగిసాకా
భాష్పవాయువులు, పెప్పర్ స్ప్రేలు
సైరన్ లు, అరుపులు, మూలుగులు లేని
స్వేచ్ఛాగాలుల్ని శ్వాసించే మంచు శిల్పాలు
ఎంత అందంగా ఉంటాయో నీకు తెలిసేలా చేస్తాను.

నువ్వే చూస్తావు! నువ్వే చూస్తావు!
ఈ సువిశాల మంచు లోకపు ప్రశాంతత
అకాల సమాధులు తవ్వటానికై భగ్నం చేయకుండా ఉన్నప్పుడు
ఎంత అందంగా ఉంటుందో!

యుద్ధం ముగిసాకా
మా Wanwun[3] బృందగానానికి తీసుకెళతాను, గొంతుకలుపు
వెండి వెన్నెల రాత్రివేళ
మా Rouff[4] బృందనాట్యంలో చేరి ఆడుదుగాని.
మేము సంతోషంగా ఉండటం నీకూ సంతోషమేనని
నీకే తెలుస్తుంది.

యుద్ధం ముగిసాకా
నిన్ను టీ కి ఆహ్వానిస్తాను
కలిసి టీ తాగుదాం
ఉప్పని రుచితో, కుంకుమ రంగు కలిగిన టీ
నీకే తెలుస్తుంది
నేనేనాడూ నీకు శత్రువుని కానని.

(When the War is over by Shabir Ahmad Mir ప్రముఖ కాశ్మీరీ కవి.)

[3] Wanwun కాశ్మీర్ సాంప్రదాయ బృందగానం

[4] Rouff కాశ్మీర్ సాంప్రదాయ బృందనృత్యం.



## కాశ్మీరీ కవిత్వం 2

కాశ్మీరి కవులు మతాన్ని ఏ దృష్టితో చూస్తున్నారు అని వెతగ్గా ఈ కవిత కనిపించింది. ఇది అందరి అభిప్రాయం అని నేను భావించను. ఒక అభిప్రాయం ఇలాకూడా ఉంది అనుకొంటాను. ఈ కవిత పైకి చాలా సింపుల్ గా అనిపిస్తున్నా కవిత చివరలో అంతా దైవదత్తమే అనుకోవటంలోని తాత్వికత చాలా లోతైనది.

కవితా శిల్పం గమనిస్తే, సంభాషణలు, దృశ్యవర్ణనా, ఉద్వేగాలు, తర్కం, సమకాలీన స్పృహ ఇవన్నీ పెనవేసుకొని ఉన్నాయి.

మతంపైన ఒక బలమైన వ్యాఖ్యానాన్ని మెత్తమెత్తగా గుండెలో బాకులా దింపినట్లనిపించింది కవిత చదివాకా. అదీ నేటితరానికి చెందిన కవి గొంతులోంచి రావటం ఇంకా ఆశ్చర్యం కలిగించింది.

★★★★

### మతం - Religion by Fazili Zabirah[5]

మొన్నోరోజు మనం
Hazratbal[6] దర్గా Park లో కూర్చొన్నప్పుడు
ఎండపడేవైపు తిరిగి నువ్వు సిగరెట్ వెలిగించావు.
నీ మొఖంపై పడిన కిరణాలు మరింత వెలుగు చిందాయి
"మతం ప్రజలకు opium లాంటిది" అన్న నీ మాట
హాస్పటల్ ICU లో ప్రాణాలతో పోరాడుతున్న
నా సోదరి గురించిన గాఢ ఆలోచనలల్లోంచి
నన్ను బయటకు తీసుకొచ్చింది
"అవును, మతం, నీకు తెలుసు కదా opium లాంటిది
అది మనుషుల్ని ఉన్మత్తుల్ని చేస్తుంది"
నేను నవ్వాను. అంగీకరించి కాదు.
నీ అమాయకత్వానికి, బోళాతనానికి.

---

[5] Fazili Zabirah శ్రీనగర్ కు చెందిన యువ కవయిత్రి. ఆమె కాశ్మీర్ యూనివర్సిటీలో ఎమ్మె ఇంగ్లీషు చదివారు.

[6] Hazratbal – శ్రీనగర్ దాల్ సరస్సు ఒడ్డున గల ప్రముఖ మసీదు

"Coleridge చాలా పెద్ద కవి
ఆయన కవిత్వం నువ్వూ చదివే ఉంటావు"
నేనన్నది నీకు అర్థం కాలేదని నువ్వు నాకేసి చూసిన
చూపుద్వారా అనిపించింది
"అందమైన కవిత్వాన్ని అతను opium మత్తులో ఉండి రాసేవాడు
అది అతనికి చాలా పేరు తెచ్చింది"
అనంగీకరంతో నువ్వూ తిరిగి నవ్వావు

"మతం, చూస్తున్నావు కదూ, ప్రపంచాన్ని ఎలా కలవరపెడుతోందో.
దాని పేరు చెప్పి
ప్రజలు చంపుకొంటున్నారు,
ప్రజలు లూటీలు చేస్తున్నారు,
ప్రజలు మానవత్వం మరచిపోతున్నారు"
ఇదివరకు కూడా నువ్వు ఇదే విషయాన్ని చెప్పిన సంగతి గుర్తొచ్చింది
అప్పుడు అంగీకరించాను కూడా .
కానీ ఆరోజు ఇంటికెళ్ళాకా పవిత్ర గ్రంథాన్ని తిరగేసాను
వాక్య వాక్యం పట్టి పట్టి చదివాను
హింస, రక్తపాతం, యుద్ధాలు ఉన్న వాక్యాలన్నింటినీ.

"నీకు తెలుసా నువ్వుచెపుతున్న అన్నింటినీ మతం ఖండించింది
నిలిచేవి శాంతి, సౌభ్రాతృత్వం
అవే కీర్తించబడ్డాయి" అన్నాను

"మతాలు ద్వేషాన్ని పెంపొందించవు
మానవ మృగాలు మాత్రమే చేస్తాయి
మతం పేరు చెప్పి
నువ్వూ నేనూ ఈ ప్రపంచాన్ని కలుషితం చేస్తున్నాం.
ఉత్త అవకాశవాదం అంతే"
నువ్వు అంగీకరించలేదు.

దేవుని గురించి మాట్లాడుకొన్నాం.
రాత్రి మాపై నీడలా పరచుకొనేవరకూ
మా సంభాషణ గంటలకొద్దీ నడిచింది.
"అలా ఐతే మనల్ని ఎవరు సృష్టించారు? ఈ కుక్కని? ఆ ఆకాశాన్ని?

ఈ భూమిని? నదుల్ని? అన్నింటినీ" ప్రశ్నించాను
నువ్వు నవ్వేసి "మరో రోజు మాట్లాడుకొందాం" అని
సిగరెట్ వెలిగించుకొంటూ పైకి లేచావు.

మృత్యువు నిశ్చయమైపోయిన నా చెల్లెల్ని
చివరిసారిగా చూడటానికి నేనూ కదిలాను.
నవ్వుతూ ఆమె మొఖాన్ని స్పృశించాను ప్రేమతో
దేవునికి కృతజ్ఞతలు తెలుపుకొన్నాను
పంతొమ్మిది ఏళ్లపాటు ఆమె సమక్షాన్ని, స్నేహాన్ని నేను ఆనందించాను
గతించిన ప్రతీ క్షణాన్ని నేను స్మృతిగా నిక్షిప్తం చేసుకొన్నాను
ఆకాశం వైపు చూసాను
ఈ అందమైన పంతొమ్మిది సంవత్సరాలను ఇచ్చినందుకు
దేవునికి కృతజ్ఞతలు చెప్పుకొన్నాను

నా హృదయం బిగ్గరగా అరచింది
“Fa’bi’ayyi aala hi rubbikumaa tu kazzibaan”
"నీ ప్రభువు అనుగ్రహాలను వేటిని నువ్వు కాదనగలవు"

Religion by Fazili Zabirah

పై కవితలోని ఖురాన్ వాక్యానికి అర్థం చెప్పిన వాహెద్ భాయ్ కి ధన్యవాదాలు

## కాశ్మీరి కవిత్వం –3

యుద్ధం చేసేది మనుషులు అయినప్పటికీ నిజానికి యుద్ధం జరిగేది విశ్వాసాల మధ్య. ఏ పక్షమైనా తాను నమ్మిన భావజాలాన్ని బతికించుకోవటం కోసం ప్రాణాలకు తెగిస్తుంది. గీతకు అవతల పక్క ఉన్నవారు – ఒకరికి శత్రువులు, మరొకరికి దేశభక్తులు కావటం అనేది గొప్ప పారడాక్స్.

ఈ కవితలో నన్ను ఆకర్షించిన అంశం కాల్పులలో చనిపోయిన వారిని వర్ణించిన తీరు. ఇది శిల్ప వైశిష్ట్యం. కవిత్వానికి ఉండే శక్తి. శత్రువుని కూడా కన్విన్స్ చేయగలిగే శక్తి అది.

★★★

### **మృతవీరుల వివరాలు** -Descriptions of the martyrs Omair Bhat[7]



1) అమీర్, 16
టోపీ ఉంది
టోర్న్ జీన్స్
ఇంకా నూగారు మొలకెత్తలేదు
చిన్నపిల్లాడు, బాగా చిన్నపిల్లాడు
కళ్ళు: రాగి చంద్రుని రంగు
గోడకు జారబడి తీయించుకొన్న ఫేస్ బుక్ ఫొటోలో నవ్వుతూ ఉన్నాడు
రాప్ గాయకుడులా, డాన్సర్ లా కనిపిస్తున్నాడు... ఎమో ఎవరికి తెలుసు

2) ఇష్ఫాక్, 24
ముక్కు: పెద్దది, కొద్దిగా ఎడమవైపుకు వంగి ఉంది
కళ్ళలో పావురాల గుంపు ఎగురుతూ ఉంది,
మబ్బుల కొమ్మను సముద్రం ముక్కుతో పొడుస్తోంది
జుట్టు అందంగా దువ్వబడి, గడ్డం చక్కగాను ఉంది
ఫొటోలో ఏదో కోల్పోయినట్లు కనిపిస్తున్నాడు

---

[7] Omair Bhat శ్రీనగర్ కు చెందిన కాశ్మీరి కవి, రచయిత. 1995 లో జన్మించాడు. వృత్తి రీత్యా డాక్టరు.

బహుసా కవి కావొచ్చు, మాటలు పండించే సేద్యగాడు కావొచ్చు
ఏమవుతాడో ఎవరికి తెలుస్తుంది

3). జాహిద్, 24
- బాంబు ధాటికి గోడకి ఉన్న కిటికీ ఎగిరిపోయింది
కళ్ళు: రెక్కలల్లాడించే సీతాకోకలు. రెక్కలు లేవు
జుట్టు: కారునలుపు
ఫొటోగ్రాఫ్: మరొక వసంతం
ఇష్టమైన ఆట: క్రికెట్
చనిపోయింది 28, మార్చ్, 2017. బుల్లెట్ గాయాలు. లక్ష్యం కాల్పులు

## 2. పచ్చబొట్లు, నిబద్ధతలు Tattoos & Commitments by Abishake Koul



ఆమె యవ్వనంలో ఉన్నప్పుడు కలిసాను
చినార్ ఆకును పచ్చబొట్టుగా వేయించుకొంది
ఆ ఆకుకు బుల్లెట్ రంధ్రం ఉండేది

ఇప్పుడా పచ్చబొట్టు ఆకు కూడా వడిలిపోయింది
ఆమె దేహాన్ని రాసుకు తిరిగిన
తుపాకులగురించి మాట్లాడేటపుడు
ఆమె స్వరం గద్గదమైంది
వేలిపై వేయించుకొన్న ఆజాదీ అక్షరాల
పచ్చబొట్టును చూపించింది ఆమె.

## 3. వలస పోవటం - Abandonment by Daaniyal Hassan



శ్రీనగర్ ఎయిర్ పోర్టులో
ఎదురుచూసే ఫర్నిచర్ కి వేళ్ళు పెరిగి
మంచునేలలోకి చొచ్చుకుపోయాయి.

చెక్కపై ద్రాక్ష లతల్ని చెక్కిన
వడ్రంగి పదునైన ఉలి
నా అరచేతిపై ఏవో గీతల్ని మెత్తగా చెక్కుతుంది
మంచుతో కప్పబడిన తలుపులు తోసుకొని
జ్ఞాపకం ప్రవేశిస్తుంది తిరిగి వెళిపోవటానికి
ఈ మట్టిలో కూరుకుపోయిన నా కాళ్ళు, చేతులకు
ఈ నిష్క్రమణ కదలిక తెస్తుంది.

నన్నిక్కడనుంచి బయటకు మోసుకువెళ్ళటానికి
ఎంత బలమైన పాదాలు కావాలీ?

నా పాదముద్రలు వీధులలో శిథిలమౌతాయి మెల్లమెల్లగా
నా ధైర్యాన్నంతా గుప్పెట్లో పెట్టుకొని
మరో ఇల్లులేనితనం లోకి వలస పోవాలి
మా హృదయాలు అగ్నికి ఆహుతి అయ్యాకా
మిగిలిన బూడిద రూపమే
రన్ వే పై పరచుకొన్న ఈ వలస పొగమంచు

మేం కోల్పోతున్న మా మాతృభూమి స్పర్శ వెనుక
అస్థిపంజరాల వరుసలు,
చరిత్రతో, యుద్ధంతో తుప్పు పట్టిన ఇంటి రేకులు,
మిగిలినవన్నీ ఉత్త ఖాళీ మేఘాల జ్ఞాపకాలు

మూడు సార్లు విమానాలు కాన్సిల్ అయ్యాయి
'ఎవరో కుట్రలు చేస్తున్నారు' అంటుంది అమ్మ
మరో ఆరు ఇంచుల మంచు పెరిగి
నాళాలలో ఇంధనం గడ్డకట్టి
విమానాల గుండెలు ఆగిపోయాకా
ఒక్క విమానం కూడా ఎగరదు

అమ్మ ఎన్ని పూజలు చేసినా
వాటి ఇనుప రెక్కలు నిర్దయగా నిలిచిపోతాయి
మృత్యువు వదంతిలా వ్యాపిస్తుంది.
దేశ బహిష్కృతునికి అంతిమ సంస్కారాలు
ఎవరు చేస్తారూ?

Abandonment by Daaniyal Hassan

## avant-garde కవిత్వం

చైనాలో డబ్బైల వరకూ కవిత్వం ప్రభుత్వ కనుసన్నల్లో ఉంటూ కమ్యూనిష్టు రాజకీయ అవసరాలకు అనుగుణంగా రాయబడేది. కవులు వ్రాసే ప్రతీ వాక్యమూ క్షుణ్ణంగా స్కృటినీకి గురయ్యేది. ఆ తరువాత ఎనభైల నుంచీ మారిన రాజకీయ పరిస్థితుల కారణంగా కవిత్వం కమ్యూనిష్టు బంధనాలను ఛేదించుకొని, స్వేచ్ఛాయుతమై కొత్త పుంతలు తొక్కింది. ఈ పునర్వికాస దశలో వచ్చిన కవిత్వాన్ని avant-garde కవిత్వమని పిలుస్తున్నారు.

అలా వచ్చిన ఆధునిక చైనా కవిత్వఉద్యమాన్ని నడిపించిన వారిలో Han Dong (1961- ) ఒకరు. అతని రెండు కవితల అనువాదాలు. ఈ రెండు కవితలూ ఆధునిక జీవితం లోని సంక్లిష్టతను, అసంబద్ధతను వ్యక్తీకరిస్తాయి. ఒక కవిత మరొకవితకు కొనసాగింపుగా అనిపించినా రెండూ భిన్న కాలాలలో వ్రాసినవి.

1.

**కొండ ప్రజలు** – Mountain People by Han Dong



చిన్నప్పుడు తండ్రిని అడిగాడు అతడు
"ఆ కొండలకు అవతల ఏముంటుంది? అని
"కొండలు" తండ్రి చెప్పాడు
"వాటి వెనుక"
"ఇంకా పెద్ద పెద్ద కొండలు"
ఏమీ మాట్లాడలేదు
కనుచూపుమేర పరచుకొన్న కొండల్ని చూస్తున్నాడు

కొండల గురించి ఆలోచించి ఆలోచించి అలసిపోయాడు
"ఈ జీవితంలో ఆ కొండల్ని దాటి వెళ్లగలనా
అవతల సముద్రం ఉందట.... చాలా దూరంగా
అక్కడకు చేరేలోగా సగం దారిలో చచ్చిపోతాను
కొండల మధ్యే చచ్చిపోవచ్చు బహుసా" అనుకొనేవాడు

తన ముసలి పెళ్లాన్ని తీసుకొని బయలుదేరితే
ఆమె దారిమధ్యలో ఒక కొడుకుని ఇస్తుంది
తాను చనిపోయేనాటికి ఆ కొడుకు పెద్దవాడవుతాడు
ఆ కొడుకు కూడా వాని ముసలి పెళ్లాంతో ప్రయాణం కొనసాగిస్తాడు

అలా ఆ కొడుకు కొడుకుకు పుట్టిన కొడుకు కూడా పెద్దవాడవుతాడు
అతను ఆలోచించడం మానేసాడు
ఈ కొడుకు ఊహలతో అలసిపోయాడు

నా పూర్వీకులు ఇలా ఆలోచించలేదు
లేకపోతే
నేను ఈ రోజు సముద్రాన్ని చూస్తూ ఉండేవాడిని కదా
అని బాధ పడ్డాడు.

2.

**నువ్వు సముద్రాన్ని చూసావు** – So you've seen the sea by Han Dong

నువ్వు సముద్రాన్ని చూసానంటావు
నువ్వు ఊహించుకొన్న సముద్రాన్ని
మొదటగా నువ్వు సముద్రాన్ని ఊహల్లో నిర్మించుకొన్నావు
తరువాత అదెలా ఉందో చూసావు
అంతే అలాగే ఉంటుంది

నిజానికి నువ్వు సముద్రాన్ని చూసావు
నువ్వో నావికుడవు ఏమీ కాకపోయినా
అప్పటికే దాన్ని ఊహించావు కూడా
అంతే అలాగే ఉంటుంది

నువ్వు సముద్రాన్ని ఊహించావు
నువ్వు ఊహించిన సముద్రాన్ని చూసావు
దాన్ని ఇష్టపడ్డావు కూడా
దాదాపు ...అంతే అలాగే ఉంటుంది
నువ్వు సముద్రాన్ని చూసావు
ఇంకా దాన్ని అప్పటికే ఊహించావు
కానీ ఆ సముద్రపు నీళ్ళల్లో మునిగి చనిపోవాలని
నీకు ఏమాత్రమూ ఇష్టం లేదు కదూ!
అంతే అలాగే ఉంటుంది
అందరకీ కూడా అంతే

## నేను మాట్లాడుతున్నాను I am Speaking by Rafael Guillen



నేను ప్రేమ గురించి మాట్లాడుతున్నాను.

ఒక చిన్నారి పెప్పరుమెంటును తన పళ్లమధ్య
పగలగొట్టి నాకు సగం ముక్క ఇచ్చింది

నేను జీవితం గురించి మాట్లాడుతున్నాను

లక్షల మంది ప్రజలు గొంతులు పగిలేలా
అది శిక్షార్హం కాదు" అని ఘోషిస్తున్నారు

నేను అమ్మగురించి మాట్లాడుతున్నాను

ఒక స్త్రీ ఏదో అనాది గీతాన్ని పాడుతూ
ఏడుస్తున్న నా ముక్కు తుడిచింది.

నేను నా దేశం గురించి మాట్లాడుతున్నాను

ఒక యువకుడు దోసిలి నిండా రక్తాన్ని నింపుకొని
దీన్ని మొదలు పెట్టింది నేను కాదు" అంటున్నాడు

నేను మృత్యువు గురించి మాట్లాడుతున్నాను

అర్ధరాత్రి ఖాళీ వీధులలో ఎవరో నోటరీ కొరకు
వెతుకుతూ తిరుగుతున్నారు

నేను విశ్వాసం గురించి మాట్లాడుతున్నాను

ఒక మతపెద్ద అంత్యక్రియలు ముగించి
కళ్ళు పైకెత్తి దేవుడివైపు చూస్తున్నాడు

నేను దేవుడి గురించి మాట్లాడుతున్నాను

సమస్తమూ నన్ను నిశ్శబ్దంగా గమనిస్తోంది.

I am Speaking by Rafael Guillen

## Haikus of Dr. Kumarendra Mallick



Dr. Kumarendra Mallick జియో ఫిసిక్స్ లో సైంటిస్ట్. కొంతకాలం హైదరాబాద్ లో పనిచేసారు. సున్నితమైన భావాలను వ్యక్తీకరించే వీరి హైకూలు, చదవగానే ఆకట్టుకొని, వెంటాడుతాయి. లోతైన పరిశీలన, విలక్షణ వీక్షణం వీరి కవిత్వ బలం. మల్లిక్ గారి కొన్ని హైకూల అనువాదాలు ఇవి.

1. శిథిలాలయం
రాళ్లమధ్య ఎదుగుతోన్న మొక్కపై
ఓ పక్షి గూడు

2. సుదీర్ఘ వియోగం...
దూరాలన్నీ మా టీకప్పుల్లో
కరిగిపోయాయి

3. స్కూలునుంచి
షూస్ నిండా సాయంసంధ్య శకలాల్ని
నింపుకొని వచ్చాడా పిలగాడు.

4. స్నానాల రేవు నీళ్లపై
నెలవంక స్వప్నాన్ని
మబ్బులు కమ్మేసాయి

5. గొప్ప అందగత్తె
ఆమె నీడనుండి
నా చూపుల్ని మరల్చలేకున్నాను

6. ఆమె శ్వాస
నా సముద్రంలో
చెలరేగిన తుఫాను

7. వసంతకాల ఉదయం
కోయిల
నా వేణువును ఊదుతోంది

8. ప్రాతఃకాల కిలకిలారావాలు
పక్షులు నా మాతృభాషలో
పాడగలవా?

10. ఉదయపు పనులు
పక్షుల కిలకిలారావాలలో
ఆమెదే ప్రధాన స్వరం

11. చిన్నపగులులో చిగురించిన
అడవిపూవు రూపంలో
రాయి నవ్వుతోంది.

12 ఖాళీ గూడు
ఆకులెన్ని ఉన్నా
చెట్టు దిగంబరంగా కనిపిస్తోంది.

13.తెల్లారేసరికి సాలీడు
మామిడి చెట్టునీ
నా కిటికీని కలిపి ముడివేసింది.

14. దీపావళి
ఒక్కొక్క తార నేలదిగి
పిల్లల దీపాలను వెలిగిస్తోంది

15. సుదూర గమ్యం
పక్షులను అనుసరించాలనే
ఒక అనాది కాంక్ష'

16. ఒక జింక
చిత్రకారుని కళ్లకు ఒక పండగ
వేటగానికి గొప్ప విందు

17. ఏకాంకనాటకం
తాత క్రిస్మస్ తాతలా
నటించాడు

18. నది ప్రవహిస్తోంది
ప్రతీ ప్రయాణమూ
రేపటి సముద్రంలో అంతమౌతుంది.

19. కొద్దిపాటి చిరుజల్లు వచ్చిపోయింది.
ఆమె బుగ్గసొట్టలు మాత్రమే
నిండాయి.

20. ఒయాసిస్సులో కుంచెను ముంచి
ఎండమావిని చిత్రిస్తున్నాడు
ఎడారి స్వాప్నికుడు.

Haikus of Dr. Kumarendra Mallick

## Poem with a Tail – Orhan Veli Kanik, Turkey poet



మనిద్దరం కలవలేం
మన మార్గాలు వేరు
నువ్వు కసాయివాని రక్షణలో ఉన్నావు
నేనో ఊరకుక్కను.
నువ్వు పింగాణీ ప్లేటులో తింటే
నేను పులినోట్లోంచి తింటాను
నువ్వు ప్రేమను స్వప్నిస్తే
నేను బొమికల్ని స్వప్నిస్తాను.

నీ మార్గం కూడా అంత తేలికైనది
ఏమీ కాదులే మిత్రమా! నాకు తెలుసు
ఏ ఆకర్షణా లేకుండా ప్రతిరోజూ
తోక ఊపుకొంటూ తిరగటం
అంత సులువు కాదు.

Orhan Veli Kanik, Turkey poet

## ఛాయా శకలాలు – by Jaime Sabines

నాకు స్పష్టంగా తెలియదు కానీ ఊహిస్తున్నాను
ఒక అమ్మాయి ఒక అబ్బాయి
ప్రేమలో పడతారు ఓరోజు
మెల్ల మెల్లగా ఏకాంతంలోకి జారుకుంటారు
తాము ఈ భూమిపై ఏకాకులమని
వాళ్ల హృదయం చెపుతుంది

ఒకరిలోకి మరొకరు ప్రవేశిస్తారు ఒంటరిగా
పరస్పరం పూరించుకొంటారు.
కళ్ళలో వెలుగు నిండినట్లు
ఇదంతా నిశ్శబ్దంగా జరుగుతుంది
ప్రేమ దేహాలను బంధిస్తుంది
మౌనంగా ఒకరినొకరు నింపుకుంటూనే ఉంటారు

ఏదో ఓరోజు వారు కౌగిలింతలో మేల్కొని
అన్నీ తెలుసుకొన్నామని అనుకొంటారు
ఒకరినొకరు నగ్నంగా చూసుకొని
పరిపూర్ణత పొందినట్లు భావిస్తారు.
(నాకూ ఖచ్చితంగా తెలియదు. ఊహించాను)

Source; Pieces of Shadow- by Jaime Sabines

## కోడి పుంజు – Rooster by Shang Qin



ఆదివారం పూట, పార్కులో ఓ మూల కాలొకటి విరిగిన ఇనుప బల్లపై కూర్చొని, ఫాస్ట్ ఫుడ్ సెంటర్ లో కట్టించుకొన్న బిర్యానీని తింటుండగా; అకస్మాత్తుగా గుర్తొచ్చింది– కొన్ని దశాబ్దాలుగా కోడిపుంజు కూత నేను వినటం లేదని.

సూర్యుడిని రమ్మని శాసించే ఆ పక్షిని నా చేతిలో ఉన్న ఎముకలతో నిర్మించటానికి ప్రయత్నించాను. ఎంతవెతికినా స్వరపేటిక కనిపించలేదు. బహుసా దాని అవసరం లేదేమో. అపరిమితంగా తింటూ తమని తాము ఉత్పత్తి చేసుకోవటమే కదా ఇక మిగిలింది.

కృత్రిమ సూర్యకాంతిలో
స్వప్నాలూ లేవు
ఉదయాలూ లేవు.

Source: Rooster by Shang Qin

## చక్రం మార్చేపని



డ్రైవర్ కారు చక్రం మారుస్తున్నాడు
నేను రోడ్డు పక్క కూర్చొని చూస్తున్నాను
నేనున్న ప్రదేశం నాకు నచ్చలేదు
నేను వెళ్ళాలనుకొన్న ప్రదేశం కూడా నాకు ఇష్టం లేదు
అయినా సరే
చక్రం మార్చే పనిని ఎందుకంత
అసహనంతో చూస్తున్నాను

Source: Changing the Wheel by Bertolt Brecht

# వీడ్కోలు

కౌగిలించుకొన్నప్పుడు
నా వేళ్ల క్రింద ఖరీదైన వస్త్రం
పేద దుస్తుల్ని స్పర్శిస్తూ నీ వేళ్ళు
క్షణకాలపు కౌగిలింత

నిన్నెవరో డిన్నర్ కి పిలుస్తారు
బలిష్టులు కొందరు నన్ను చుట్టుముడతారు.
వాతావరణం గురించీ
చిరకాలం నిలిచే మన స్నేహం
గురించీ మాట్లాడుకొంటాం

ఇతర విషయాలన్నీ చేదు చేదు.

Source: Parting by Bertolt Brecht

## పొగ

కొలను పక్క చెట్లమధ్య ఓ చిన్న ఇల్లు
ఇంటి కప్పునుంచి పొగ బయటకు వస్తోంది.
అదే లేకపోతే
ఇల్లు, చెట్లు, కొలనూ
ఎంత బావురుమంటూ ఉండేవో.

The Smoke by Bertold Brecht

## రాక్షసుని ముఖతొడుగు

నా గదిగోడకు
ఓ జపనీయ చెక్కబొమ్మ తగిలించి ఉంది
రాక్షసుని ముఖం అది
దాని లక్కపూత బంగారంలా మెరుస్తోంది

తదేకంగా పరిశీలించాను
రాక్షసునిగా ఉండటంలో ఎంత ప్రయాస ఉందో
ఉబ్బిన నుదిటి నరాలు
తెలుపుతున్నాయి.

The mask of Evil by Bertold Brecht

## దాహంతో చచ్చిపోయిన ఒక నది



ఇక్కడ ఒక నది ఉండేది, ఇరు తీరాలతో.
ఆ నదిని వానచినుకులతో పోషించే
స్వర్గలోకపు అమ్మ కూడా ఉండేదిక్కడ.

కొండకోనల్లోంచి జారుతో
మందగమనంతో పారేది అది.
ఓ అందమైన అతిథిలా గ్రామాలను సందర్శిస్తూ
లోయలకు పచ్చదనాన్ని, కొండఫలాల్ని అందించేది.
రాత్రివేళల తీరాలపై దొర్లే సరదాప్రియులను చూసి నవ్వుకొంటూ సాగేది

"మబ్బు పాలను తాగి, పశువులకు నీళ్ళు తాపి
జెరుసెలేమ్ కు, డమాస్కస్ కు ఉరకలెత్తిన నది"
అప్పుడప్పుడూ అది వీరోచితంగా గానం చేసేది
ఒక్కోసారి ఉద్రేకంతో.

ఇక్కడ ఒక నది ఉండేది, ఇరు తీరాలతో.
వానచినుకులతో ఆ నదిని పోషించే
స్వర్గలోకపు అమ్మ కూడా ఉండేది
కానీ వాళ్లు దాని అమ్మను అపహరించాక
ఆ నదికి నీరు లభించక
క్రమక్రమంగా చచ్చిపోయింది, దాహంతో

మూలం: A river dies of thirst by Darwish

## ఇద్దరు అపరిచితులు

ఆకాశం వైపు చూసాడు
ఒక నక్షత్రం అతని వైపే చూస్తోంది

లోయలోకి చూసాడు
అతని సమాధి అతనివైపే చూస్తోంది

తనను బాధించిన, ఆనందింపచేసిన
స్త్రీ వైపు చూసాడు
ఆమె ఇతని వైపు చూడటం లేదు

అద్దంలో చూసుకొన్నాడు
దాన్లోంచి అతని లాంటి మరో అపరిచితుడు
అతన్నే తొంగి చూస్తున్నాడు

మూలం Two strangers by Darwish

## ఉదాసీనుడు

అతను దేనినీ లక్ష్యపెట్టడు.
వాళ్ళు అతని ఇంటికి కుళాయి నిలుపుచేస్తే:
'పరవాలేదు! వానాకాలం దగ్గరలోనే ఉంది' అంటాడు.
కరంటు ఆపు చేస్తే: ఆవులిస్తూ
"పరవాలేదు, ఈ వెలుగు సరిపోతుంది' అంటాడు
నీ జీతం తగ్గిస్తాం అని వాళ్ళు బెదిరిస్తే,
'పరవాలేదు! మద్యం, సిగరెట్లు మానేస్తాను' అంటాడు
అతన్ని వాళ్లు జైలులో పెట్టినపుడు
'పరవాలేదు, జ్ఞాపకాలతో కొంతకాలం ఏకాంతంగా
గడపవచ్చు' అంటాడు.
ఇంటివద్ద దిగపెట్టినపుడు:
'పరవాలేదు! ఇది నా ఇల్లు' అంటాడు

ఒకసారి అతణ్ణి కోప్పడుతూ అడిగాను
'రేపు ఎలా జీవించాలనుకొంటున్నావు' అని

అతనన్నాడూ
'ఈ రేపు నన్ను బాధించదు.
అదొక ఒఠి ఊహ. నన్ను ఆకర్షించదు
నేను నేను మాత్రమే: నన్ను ఏదీ మార్చలేదు
నేను దేన్నీ మార్చలేనట్లుగానే,
నా సంతోషాల్ని దూరం చేయకు.

'నేనేమీ Alexander the Great లేదా
Diogens ని' కాదులే అన్నాను

'నిర్లిప్తత అనేది ఒక వేదాంతం
ఒకరకమైన ఆశావహ దృక్పథం కూడా' అన్నాడతను.
.
మూలం: The indifferent one by Darwish, Mohmoud

## Who remains standing – Andree Chedid



ముందుగా
నీ పేరు చెరిపేసుకో
గతాన్ని రద్దుచేసుకో
నిన్ను చుట్టుముట్టినవాటిని చెదరగొట్టు
నువ్వు దేన్నైతే
నీ అస్తిత్వం అనుకొంటున్నావో
దాన్ని సమూలంగా పెకలించుకో
చివరకు ఏం నిలిచింది?

అప్పుడు
నీ పేరుని మరలా రాయి
నీ వయసును తిరిగి తెచ్చుకో
నీ ఇంటిని మరలా నిర్మించుకో
నీ మార్గాన్ని అనుసరించు
ఇంకా
మళ్లీ ప్రారంభించు... మొదటి నుంచీ.

.

Andree Chedid – Egypt born French Poetess

## Breakfast – by Jacques Prévert



నాతో ఏమీ మాట్లాడకుండా
అతను డికాక్షన్ ను
కప్ లోకి తీసుకొన్నాడు
అతను ఆ కాఫీ కప్ లోకి
కొంచెం పాలు ఒంపుకొన్నాడు
అతను దానిలో
చక్కెర వేసుకొని
ఒక స్పూనుతో కలయతిప్పి
ఆ వేడి café au lait ని తాగి
కప్పు టేబుల్ పై పెట్టాడు

నాతో ఏమీ మాట్లాడకుండా
అతను ఒక సిగరెట్ వెలిగించి
పొగను రింగులుగా ఒదిలాడు
అతను సిగరెట్ నుసిని
యాష్ ట్రే లోకి విదిలించాడు

నాతో ఏమీ మాట్లాడకుండా
నన్ను కనీసం చూడకుండా
అతను లేచి
టోపీ పెట్టుకొని
బయట వర్షం వస్తున్నందున
రెయిన్ కోట్ వేసుకొని
వానలో అలా నడుచుకొంటూ
వెళిపోయాడు
ఒక్క మాటలేకుండా
నాకేసి అసలు చూడకుండానే....

నేను, నేను నా చేతుల్లో
మొఖం పెట్టుకొని
ఏడుస్తూనే ఉన్నాను.

ఫ్రెంచి కవి Jacques Prévert వ్రాసిన Breakfast (Déjeuner du matin) కు అనుసృజన

ఈ కవితకు దృశ్యరూపాలు కొన్ని యూట్యూబ్ లో ఉన్నాయి. వాటి లింకులు

http://www.youtube.com/watch?v=fLfcDrMvlfw

http://www.youtube.com/watch?v=6Z4EAdREWsM

పైకి సాదా సీదాగా అనిపించినా ఈ కవితలో ఏదో తెలియని శూన్యతను పరాకాష్టకు చేర్చినట్టు నాకనిపించింది.

రెండో వీడియోలోని వ్యక్తులు ఇద్దరూ మగవాళ్ళు అవ్వటం గమనార్హం (కవితను చదివినప్పుడు నాకొచ్చిన సందేహం అదే. ఇది ఎవరిమధ్య జరిగిఉంటుంది అని)

తెలుగు కవితలు కూడా ఇలా వీడియోల రూపంలో కనిపించే రోజులు ఎప్పటికైనా వస్తాయని ఆశిస్తూ

## ఒక పక్షి చిత్తరువు వెయ్యాలంటే

మొదట ఒక పంజరాన్ని చిత్రించు
దాని తలుపు తెరిచుండాలి
తరువాత
ఆకర్షణీయమైనది ఏదైనా
అందమైనది ఏదైనా
ఉపయోగపడేది ఏదైనా
డాంబికము లేనిది ఏదైనా
పక్షికొరకు చిత్రించు

ఇపుడు ఆ కాన్వాస్ ను
ఏదైనా ఒక చెట్టువద్ద ఉంచు
తోటలోనో, వనంలోనో లేదా అరణ్యంలోనో.
ఇక ఆ చెట్టు వెనుక దాక్కో
ఏమీ మాట్లాడకు
ఏమాత్రం చప్పుడుచేయకు

ఒక్కోసారి పక్షి వెంటనే రావొచ్చు లేదా
రావటానికి కొన్ని సంవత్సరాలు పట్టొచ్చు
నిరాశ చెందకు
నిరీక్షించు
అవసరమైతే సంవత్సరాల తరబడైనా.

నీ చిత్తరువు యొక్క విజయం
అది తొందరగా వచ్చిందా లేక ఆలస్యంగా వచ్చిందా
అన్నదానిపై ఆధారపడి ఉండదు
పక్షి అంటూ వస్తే.

పక్షి వచ్చాకా
గంభీరమైన నిశ్శబ్దాన్ని పాటించు
అది పంజరంలోకి వెళ్ళేవరకు ఎదురుచూడు
లోపలకు వెళ్లగానే
కుంచెతో పంజరం తలుపు మృదువుగా మూసెయ్యి.

తరువాత
పంజరం ఊసల్ని ఒక్కొక్కటిగా చెరిపేయి
పక్షి ఈకలను ఏమాత్రం తాకకుండా చేయి ఆ పని
అలాగే ఓ చెట్టు బొమ్మను చిత్రించు
దాని అందమైనకొమ్మలలో ఒకదాన్ని
పక్షి కొరకు కేటాయించు.
ఇంకా పచ్చని ఆకులను, తాజా గాలులను
సూర్యకాంతి తుంపరలను, వేసవి మద్యాహ్నపువేళ
పచ్చికలోంచి వచ్చే కీటకాల శబ్దాలను కూడా చిత్రించు.

ఇక ఆ పక్షి గొంతువిప్పి పాడేవరకు ఎదురుచూడు
పాడలేదా! అది అశుభం
నీ చిత్తరువుకు అది అపశకునం
పాడిందా! అది చక్కని శుభసంకేతం
మెల్లిగా ఆ పక్షి ఈకనొకదాన్ని సేకరించు
కాన్వాసు కు ఒక మూల నీ పేరును రాసుకో!

To Paint The Portrait Of A Bird by Jacques Prevert (tr. John Dixon Hunt)

## అరాజకీయ మేథావులు ...... Otto Rene Castillo



ఏదో ఒక రోజు
సామాన్య జనం
రాజకీయ చైతన్యం లేని
నా దేశ మేథావులను ప్రశ్నిస్తారు
తమ సమాజం విస్మరింపబడి
చలిమంటలా క్రమక్రమంగా
ఆరిపోతున్నప్పుడు
మీరేం చేసారు అని ప్రశ్నిస్తారు

వారి దుస్తుల గురించి
సుష్టుగా భోంచేసిన తర్వాత
తీసే కునుకుల గురించి
ఎవరూ ప్రశ్నించరు.
"అంతా మిథ్య" అనే వారి
వ్యర్ధ వాదనల గురించి
ఎవరూ తెలుసుకోవాలనుకోరు.
వారి ఆర్ధిక శాస్త్ర నైపుణ్యం గురించి
ఎవరూ మాట్లాడరు.
గ్రీకు పురాణాల గురించి లేదా
వారిలోని ఒకడు చనిపోతుంటే
వారెలా అసహ్యించుకొన్నారో
అనే దాని గురించి ఎవరూ ప్రశ్నించరు.
పెద్ద అసత్యం నీడన పెంచిపోషించిన
వారి అర్ధంలేని సమర్ధనల గురించి కూడా
వారినేమీ ప్రశ్నించరు.

ఆ రోజు
అరాజకీయ మేథావుల పుస్తకాలలో
కవిత్వంలో ఏనాడూ ప్రస్తావింపబడని
సామాన్యజనం వస్తారు.

ఎవరైతే వారికి

రొట్టెలు పాలు గుడ్లు అందించారో
ఎవరైతే వారి దుస్తులు కుట్టారో
ఎవరైతే వారి వాహనాలను నడిపారో
ఎవరైతే వారి కుక్కలను, తోటలను సంరక్షించారో
వారికొరకే పనులు చేసారో
వాళ్లు వచ్చి ప్రశ్నిస్తారు
"నిరుపేదలు బాధపడినపుడు
వారినుంచి లాలిత్యము, జీవము
హరించుకుపోతున్నప్పుడు
మీరేం చేసారు"? అని.

నా ప్రియమైన దేశ
రాజకీయ చైతన్యం లేని మేధావులారా!
మీ దగ్గర సమాధానం ఉండదు.
నిశ్శబ్దమనే రాబందు
మీ పేగులను పీక్కుతింటుంది
మీ దీనస్థితి
మీ ఆత్మను క్షోభపెడుతుంది
ఆరోజు
మీరు సిగ్గుతో తలదించుకొంటారు

(Otto Rene Castillo గుటమెలా దేశానికి చెందిన విప్లవకారుడు, కవి)

# తిరుగుబాటు కవి – ఖాజి నజ్రుల్ ఇస్లాం



ప్రతి ఉద్యమంలోంచి ఒక కవి పుడతాడు. ఆ ఉద్యమానికి సరిపడా జవసత్వాలను అందిస్తాడు. అలా స్వరాజ్య ఉద్యమం ఉవ్వెత్తున జరుగుతున్న రోజుల్లో బెంగాలి కవి, ఖాజి నజ్రుల్ ఇస్లాం తన "విద్రోహి" కవితతో ఉద్యమాన్ని పరుగులెత్తించాడు. 1921 డిసెంబరులో నజ్రుల్ "విద్రోహి" కవిత వ్రాసాడు. ఈ కవితలో స్వాతంత్రేచ్ఛ, వైయక్తిక స్వేచ్ఛ జమిలి నేతగా కలిసిపోయి ఉంటాయి. ఇది ప్రజలను ఆకర్షించింది. అప్పటి ప్రజలు అలాంటి కవితకోరకే ఎదురుచూస్తున్నారా అన్నట్లు, అచ్చయిన అనతి కాలంలోనే నజ్రుల్ కు తిరుగులేని తిరుగుబాటు కవిగా పట్టం కట్టారు.

ఈ నజ్రుల్ కవిత్వాన్ని బెంగాలీ తెలిసిన శ్రీ పురిపండా అప్పలస్వామి ద్వారా శ్రీ శ్రీ, నారాయణబాబు, చాసో, రోణంకి వినేవారు. "విద్రోహి" కవిత నన్ను ప్రేరేపించిందని నారాయణ బాబు బాహాటంగా చెప్పుకొన్నాడు. "నజ్రుల్ ఇస్లాం గీతాలు నా మనస్సులో ఏదో మారుమూలల్లో మారు మోగుతూ ఉండి ఉండాలి" అని శ్రీశ్రీ ఒప్పుకొన్నాడు. అభ్యుదయ తెలుగు కవిత్వానికి ఒక దీపస్థంభంలా నిలిచిన కవిత ఇది. ఒక వైయక్తిక వాక్యాన్ని సామాజికం చేసిన ఆధునిక రచనలలో విద్రోహి కవిత, మహాప్రస్థాన కవితల కంటే ముందుంటుంది. అది చరిత్ర.

నేడు యూట్యూబ్ లో "Bidrohi poem by Kazi Nazrul Islam" అని వెతికితే– ఎంతో మంది యువకులు బెంగాలీలో విద్రోహి కవితను ఆవేశంగా, ఉద్వేగభరితంగా స్టేజ్ పై గానం చేస్తోన్న వీడియోలు అనేకం కనిపిస్తాయి. (ఒక్కో వీడియోకి లక్షల కొద్దీ వీక్షణలు ఉన్నాయని తెలిసాక తెలుగు సమాజం ఆ స్థాయికి ఎప్పటికి ఎదుగుతుందా అని బెంగ పడతాం).

ఒక కవిత దాదాపు శతాబ్దకాలం తరువాత కూడా యువత నాలుకలపై బ్రతికి ఉందంటే ఆశ్చర్యం కలగకమానదు. ఈ కవిత ఆనాటి సమాజానికి ఎంతైతే రిలవెన్స్ ఉండిందో, సమకాలీన సమాజానికి కూడా అంతే రిలవెన్స్ ఉంది.

★★★

## ద రెబెల్ - (Bidrohi by Kazi Nazrul Islam, 1921)

ప్రకటించు వీరుడా ప్రకటించు
నా శిరస్సు మహోన్నతము!
నన్ను చూసి హిమాలయ శిఖరం తల దించుకొంది.

ప్రకటించు వీరుడా ప్రకటించు
ఖగోళమండలాన్ని బద్దలు కొట్టి
సూర్యచంద్రులు గ్రహాలు నక్షత్రాలను తరిమేస్తాను.
భూమ్యాకాశాలను చీల్చుకొని
దేవుడి పవిత్ర పీఠాన్ని పక్కకునెట్టి
పుడమితల్లి అంతులేని అద్భుతంలా
పైకి లేస్తాను.
కోపోద్రిక్త దేవుడు నా నుదుటిపై మెరుస్తూంటాడు
యుద్ధవిజేతకు దక్కిన కీర్తి పతకంలా.

ప్రకటించు వీరుడా
నా శిరస్సు సర్వోన్నతము!
నేను నిరంకుశుడను నిర్దయుడను అహంకారిని
నేను ప్రళయకాలంలో నర్తించే నటరాజును
నేను ఝుంఝూమారుతాన్ని నేను విధ్వంసాన్ని
నేను శ్రేష్ఠమైన భయాన్ని, ఈ ప్రపంచపు శాపాన్ని
నేను కృపారహితుణ్ణి అన్నిటినీ తుత్తునియలు చేస్తాను
నేను అవ్యవస్థను, అవిధేయుడను
నేను నిబంధనల్ని మర్యాదల్ని కాళ్ళతో మర్దిస్తాను
నేను లయకారక ధూర్జటిని, గ్రీష్మకాలపు ఉత్పాత ప్రభంజనాన్ని
నేను విద్రోహిని, ప్రపంచ విప్లవానికి పుట్టిన పుత్రుడిని
ప్రకటించు వీరుడా
నా శిరస్సు సర్వోన్నతము!

నేను రాక్షస తుఫానును, ఉగ్ర ఉప్పెనను
నా దారికి అడ్డం వచ్చిన అన్నింటినీ ధ్వంసం చేస్తాను
నేను నాట్యంతో మత్తెక్కిన లయ ను
నేను నా తాళానికే నాట్యం చేసుకొంటాను

నేను విశృంఖల జీవన పారవశ్యాన్ని
నేను హమీరాన్ని★ నేను ఛాయానాదాన్ని★ నేను హిందోళాన్ని★
నేను అవిశ్రాంతాన్ని
నా నడకా నృత్యం ఒక కేళీవిలాసం
నేను శత్రువును కౌగిలించుకొంటాను, మృత్యువుతో యుద్ధం చేస్తాను
నేను ఉన్మత్తుడను. నేను కుంభవృష్టిని
నేను భయపెట్టే మహమ్మారిని
నేను రక్తపాత నియంతల మృత్యువును
నేను ఎప్పటికీ ఒక వెచ్చని అశాంతిని

ప్రకటించు వీరుడా
నా శిరస్సు సర్వోన్నతము!

నేను సృష్టిని నేను విలయాన్ని
నేను ఇల్లుని నేను స్మశానాన్ని
నేను అంతాన్ని నేను ఉదయాన్ని
నేను స్వర్గలోక మహారాజ్ఞి ఇంద్రాణి పుత్రుణ్ణి.
తలపై చంద్రుడు, నుదుటిపై సూర్యునితో
ఒక చేత మెత్తని మురళి, మరో చేత యుద్ధ శంఖంతో
నేను Bedouin[1] ని Chengis ని

నేను నాకు తప్ప మరెవ్వరికీ తలవంచను
నేను ఉరుమును
నేను భూమిపై, ఆకాశంపై ధ్వనించే బ్రహ్మ శబ్దాన్ని
నేను Israfil[2] వాయిద్యపు మహా ఘర్జనను
నేను పినాకపాణి త్రిశూలాన్ని
నేను సత్యదేవత సేవకుడను
నేను శంఖు చక్రాన్ని
నేను బలమైన అనాది అరుపును
నేను విశ్వామిత్రుని శిష్యుడను, కోపిష్టి దూర్వాసుడను
నేను దావానలపు ఆగ్రహాన్ని
నేను విశ్వాన్ని బూడిదచేస్తాను
నేను హృదయాంతరాళంలోంచి ఉబికిన అట్టహాసాన్ని
నేను సృష్టికి శత్రువుని, భయహేతువుని

నేను యుగాంతాన ద్వాదశాదిత్యులకు పట్టే గ్రహణాన్ని
నేను అప్పుడప్పుడు ప్రసన్నుడను, ఒక్కొకపుడు అస్థిరబుద్ధుడను
నేను ప్రాతఃకాల నూత్న యవ్వనాన్ని
నేను మహాబలి గర్వాన్ని పాదాల క్రిందపడేసి తొక్కుతాను

నేను ప్రచండ పవన ప్రకోపాన్ని
నేను అల్లకల్లోలిత సముద్రపు ఘోషను
నేను అనంత తేజో ప్రకాశాన్ని
నేను గలగల పారే సెలయేరుని
నేను కన్నియ మెలిసేనల్లని వాల్జడను
నేను నిలువరించే ఆమె కన్నుల వెలుగును
నేను పదహారేళ్ల చిన్నదాని హృదయంలో పుష్పించే మెత్తని ప్రేమను
నేను అప్రమేయ ఆనందాన్ని
నేను భగ్న ప్రేమికుని విరహ గీతాన్ని
నేను అనాధల హృదయాల చేదు కన్నీటిని
నేను అభాగ్యుల నిస్సయాహ నిట్టూర్పుని
నేను నిరాశ్రయుల శోకాన్ని వేదనని
నేను అవమానింపబడిన హృదయ క్షోభను
నేను మోసగించబడిన ప్రేమికుల విషాదాగ్నిని

నేను సంబాళించుకోలేని పరితాపాన్ని
నేను అక్షతయోని వణికే ప్రధమ స్పర్శను
నేను ఆమె నుండి దొంగిలించిన నునులేత మొదటి చుంబనాన్ని
నేను రహస్య ప్రేమికురాలి క్షణమాత్రపు వాలు చూపు మెరుపుని
నేను ఆమె విప్పారిన కన్నులతో రెప్పవేయక చూసే వాంఛను
నేను యవ్వనవతి రసిక బిగి కౌగిలిని
నేను ఆమె గలగలలాడే గాజుల సంగీతాన్ని
నేను అనశ్వర శిశువును, నిత్య యవ్వనుడను
నేను మొలకెత్తుతోన్న యవ్వనాన్ని భయంతో దాచుకొనే బాలిక సిగ్గును
నేను మెత్తని దక్షిణ గాలులను
నేను వ్యాకుల పరచే తూర్పు పవనాలను
నేను దేశద్రిమ్మరి కవిగాయకుని గంభీర గీతాన్ని
నేను అతను సారంగిపై పలికించే మృదు సంగీతాన్ని

నేను నడివేసవి మధ్యాహ్నపు తీరని మొండి దాహాన్ని
నేను ప్రజ్వలించే ప్రచండ మార్తాండుడిని
నేను ఎడారిలో ఉబికే నీటి చెలమను, చల్లని శాద్వలము ని
నేను ఆనంద పరవశంతో అటూ ఇటూ పర్వులిడతాను
ఒక్కసారిగా నన్ను నేను తెలుసుకొంటాను
అన్ని శృంఖలాలు తెగిపోతాయి

నేనే ప్రారంభాన్ని నేనే ముగింపును
నేనే మానసిక అంతఃశ్చేతనలోని చైతన్యాన్ని
నేనే ఈ ప్రపంచపు వాకిట ఎగురుతోన్న విజయకేతనాన్ని
నేనే మానవజాతి గెలుపుకు గౌరవ చిహ్నాన్ని
విజయోత్సాహంతో ఉచ్చైశ్రవం అధిరోహించి భూమి ఆకాశాలపై
తుఫానులా కలియదిరుగుతాను

నేను భూమి వక్షస్థలంపై రగిలే అగ్నిపర్వతాన్ని
నేను మహారణ్యాలను దహించే దావానలాన్ని
నేను నరకలోకపు ఉన్మత్త మహోగ్ర క్రోధాన్ని
నేను మెరుపు రెక్కలపై విహరిస్తాను
నేను దుఃఖాన్ని, భయాన్ని ఎల్లెడలా వెదజల్లుతాను
నేను భూకంపాలు పుట్టిస్తాను
నేను Orpheus[3] వేణువుని
నేను జ్వరపడిన ప్రపంచాన్ని నిద్రపుచ్చుతాను
నరకలోకం నన్ను చూసి హడిలి చస్తుంది

నేను ఈ లోకానికి తిరుగుబాటు నేర్పుతాను
నేను జలప్రళయాన్నిఒక్కోసారి ఈ భూమిని సారవంతం చేస్తాను
మరోసారి నష్టాన్ని కలిగిస్తాను
నేను విష్ణుమూర్తి ఇద్దరు దేవి లను కబళిస్తాను
నేను అధర్మాన్ని, నేను ఉల్కాపాతాన్ని నేను శనిని
నేను తోకచుక్కను, నేను విషనాగును
నేను తల తెగిన చండిని
నేను నరకలోక జ్వాలల మధ్య కూర్చొన్న యుద్ధదేవతను
నేను అందమైన పూవులా నవ్వుతాను

నేను పరశురాముని గండ్రగొడ్డలిని
యోధుల్ని సంహరించి ఈ లోకంలో శాంతిని స్థాపిస్తాను
నేను బలరాముని భుజాలపై నాగలిని
నేనీ ప్రపంచాన్ని పెళ్ళగించి శాంతి సౌభాగ్యాలను పండిస్తాను
పోరాటాలతో అలసిపోయిన నేను.. గొప్ప విప్లవకారుడిని
పీడితుల రోదనలు ఈ గాలిలో ప్రతిధ్వనిస్తున్నంత వరకూ
నేను విశ్రమించను
క్రూర పాలకులు యుద్ధాలలో కత్తులు ఝుళిపిస్తున్నంత కాలమూ
నేను నిద్రపోను
నేను గొప్ప విప్లవకారుడిని
ఈ లోకం కన్నా చాలా ఉన్నతంగా ఎదిగాను .. ఒంటరిగా
నా శిరస్సు సర్వోన్నతము!

Sources

1. Bidrohi by Kazi Nazrul Islam
2. Kabir Chowdhury ఇంగ్లీషు అనువాదం
3. Rezaul Karim Talukdar ఇంగ్లీషు అనువాదం
4. Sajed Kamal ఇంగ్లీషు అనువాదం

సూచికలు:

1. రాగాల పేర్లు
2. దేవుని అంతిమతీర్పు రోజున బూరా ఊదెడి దేవదూత
3. గ్రీకు పురాణగాథలలోని సంగీత దేవత

ఈ గీతం బెంగాలి మాతృకలో ఆలపిస్తున్న వీడియో లింకులు

https://www.youtube.com/watch?v=RYTqnT_uTLU&t=84s

https://www.youtube.com/watch?v=xhcQonDcFfo&t=1s

## Landscape with Yellow Birds by Shuntaro Tanikawa




పక్షులు ఉన్నాయి కనుక
ఆకాశం ఉంది
ఆకాశం ఉంది కనుక
బుడగలు ఉన్నాయి
బుడగలు ఉన్నాయి కనుక
పిల్లలు పరుగులు తీస్తున్నారు
పిల్లలు పరుగులు తీస్తున్నారు కనుక
నవ్వులున్నాయి
నవ్వులున్నాయి కనుక విషాదం ఉంది
విషాదం ఉంది కనుక
ప్రార్ధనలు, మోకరిల్లటానికి నేల ఉన్నాయి
నేల ఉంది కనుక
నీళ్ళు ప్రవహిస్తున్నాయి
ఇంకా నేడు, రేపూ, ఒక పచ్చని పిట్టా ఉన్నాయి

అందుకనే ఇన్ని రంగులతో, రూపాలతో, నడకలతో
ఈ ప్రపంచం ఇంకా ఉంది

by Shuntaro Tanikawa and translated from the Japanese by Harold Wright

## The White Vase



వేసవి ఇంకా పోలేదు
నువ్వు నేనూ కూడా.
తలుపు మూసిఉంది
మధ్యాహ్నపు సూర్యుడు
కిటికీ అద్దాలను వేడెక్కిస్తున్నాడు
చెట్లనీడలు చిక్కబడుతోన్నాయి

పింగాణి కూజా ఉన్న నల్లబల్లపై ధూళి
ఉత్త ధూళి
అలా నిశ్చలంగా

by Henrik Nordbrandt, translated by Patrick Philips

## అగ్ని వృక్షం



నది వొడ్డున ఒక చెట్టు
ఆకులు ఆకులుగా శోకిస్తున్నది
కన్నీటిని బొట్లు బొట్లుగా తీరంపై
చల్లుతోంది.
అగ్నిభవిష్యద్వాణిని
నదికి వినిపిస్తోంది
ఎవరూ చూడని
దాని చివరి ఆకుని నేను.

నా వాళ్ళూ
మంటల వలె గతించారు
ఒక్క జాడైనా మిగల్చకుండా
గతించారు.

source: Tree of Fire by Adonis

## Adam by Adonis

చెప్పుకోలేని నొప్పితో
ఉక్కిరిబిక్కిరౌతూ
ఆదాము నా చెవిలో రహస్యంగా
ఇలా అన్నాడు
"ఈ ప్రపంచానికి నేను
ఆదిమ తండ్రిని కాను
నాకు స్వర్గం కించిత్తైనా
కనిపించలేదు
దేవుని యొద్దకు నన్ను తీసుకొని పో"

Adam by Adonis

## కులం -- Caste by Lal Singh Dil

\



నన్ను ప్రేమిస్తున్నావా, నిజంగా?
వేరే కులానికి
చెందినప్పటికి కూడా ప్రేమిస్తున్నావా!
కానీ
మన పెద్దలు
వారి శవాలను కూడా ఒకే చోటులో
కాల్చరన్న విషయం నీకు తెలుసా!

Translated into English by Nirupama Dutt

## లియొనార్డ్ కొహెన్ రెండు పద్యాలు



1.
కిటికీ పైకి లేపాను
కాంతి ఈ కవితపై వాలింది.
ప్రముఖ వీధిలో
ఒక డాబాపై హింసించబడ్డ
అతని పేరు మీద వాలింది.
విరిగిన అతని కాలుకి
ప్రతీకారం తీసుకొంటానని
సూర్యకాంతిపై ప్రమాణం చేస్తున్నాను.

2.
కిటికీ పైకి లేపాను
కాంతి ఈ వాక్యాలపై వాలింది
(అసంపూర్ణ వాక్యాలవి)
ముఖ్యంగా ఓ రెండు పదాలపై వాలింది
వాటిని చెరిపేయాలి.
ప్రముఖ వీధిలో
ఒక డాబాపై హింసించబడ్డ
అతని పేరు అది.
అతని సలహా తీసుకొంటానని
నా కవిత్వంలో ఆ సాక్ష్యాలు తొలగిస్తానని
గాయపడ్డ అతని కాలు గురించి మర్చిపోతానని
సూర్యకాంతిపై ప్రమాణం చేస్తున్నాను.

Energy of Slaves నుండి

## చిన్న చిక్కు- Chandrakant Deotale



"నా వద్ద కొద్దిపాటి స్థలముంటే
కుమ్మరి వద్దనుంచి కొన్ని ఇటుకలను
అరువు పుచ్చుకొని
ఓ గుడెసెను నిర్మించుకొనేవాడిని
వెదురుకర్రలు మాత్రమే నా వద్ద లేవు"

అతనలా చెప్పినప్పటి నుంచీ
నేను అన్వేషిస్తూనే ఉన్నాను
కొన్ని వెదురుకర్రలు సంపాదించి అతనికిద్దామని.

అతనికి కొద్దిపాటి స్థలముంటే
అతను కుమ్మరి నుండి ఇటుకలను
అరువు తెచ్చుకోగలడు కనుక
ఓ చిన్న గుడిసె తయారయిపోయి ఉండేది.

మేమలా సాగుతుండగా
సముద్రం ఆకాశం అంతేలేని భూమి
కనిపించాయి
ఈ మూడూ ఎవరికీ చెంది లేవు
మేము వెంటనే అరిచాం
ఇది మా సముద్రం మా ఆకాశం మా భూమి అని.

ఆ మూడింటినీ
మా పిడికిళ్ళలో కానీ కళ్లల్లో
చేతులలో కానీ నింపుకోలేకపోయాం.
కనీసం ఓ ముక్క ఆకాశాన్నో ఓ చెక్క భూమినో
సముద్రాన్నో అమ్ముకోలేకపోయాం.
ఆ విధంగా మేము అనంతానికి అధిపతులయ్యాం

కానీ చిన్న చిక్కు మాత్రం అలానే
మిగిలిపోయింది మా ఇద్దరకూ.
అతనివద్ద స్థలం లేదు
నా వద్ద వెదురు కర్రలు లేవు.

"A Minor Difficulty With The Two Of Us" -- Chandrakant Deotale

## మృత్యువు మాత్రమే - పాబ్లో నెరుడా

మూగ ఎముకలు నిండిన గోరీలతో
ఏకాకి స్మశానాలవిగో.
సొరంగం గుండా హృదయ యానం
నీడలు.... నీడలు.... నీడలు.

మనలోకే కూలిపోయే ఓడలా
మనం చనిపోతూంటాం.
హృదయంలోకే మునిగిపోయినట్లుగా
చర్మంనుండి ఆత్మదాకా
అనంతంగా జారిపోయినట్లుగా
మనం చనిపోతూంటాం.
గవ్వలు పేరుకొన్న శిలలపాదాలవిగో
అక్కడంతా మృతదేహాలు.

స్వచ్ఛమైన శబ్ధంలా ఎముకలలో మృత్యువుంది.
ఏ కుక్కా లేకుండా వినిపించే మొరుగులా
గంటలనుంచో, గోరీలనుంచో జనిస్తో, తేమలో ఉబ్బుతో
ఒక ఏడ్పులానో లేక వానలానో మృత్యువు శబ్దిస్తోంది.

ఒంటరిగా ఒక్కోసారి నేను చూస్తుంటాను
తెరచాప నీడలో శవపేటికల్ని.
మృతుల, మృత జడల జవ్వనుల
తెల్లని దేవదూతల్లాంటి వంటవాళ్ల,
గుమస్తాలను పెండ్లాడిన శోక యవ్వనిల
లంగరు బరువును మోస్తోన్న
శవపేటికలను చూస్తూంటాను.

నిలువెత్తు మృత్యునదిలో
ఎర్రగా ఒరిసిపోయిన ఆ నదిలో
ప్రవాహానికి ఎదురొడ్డుతూ
మృత్యు సంగీతపు అలలతో శ్రుతి కలుపుతూ
మృత్యు మౌన కెరటాల సవ్వడితో జతకలుపుతూ
శవపేటికలు ఎగప్రాకటం

ఒక్కోసారి నేను గమనిస్తూంటాను.
మృత్యువు కనిపించదు, దాని శబ్ధమే నడిపిస్తూంటుంది.
పాదం కనిపించని బూటులా, దేహం అగుపించని సూటులా.
రాతితో కానీ, చేతితో కానీ చేయబడని
గణగణ మనే ఘంటారావం లా మృత్యువు వినిపిస్తుంది.

మృత్యువుకు నోరు లేదు, నాలుక లేదు, గొంతుకా లేదూ,
కానీ, మృత్యు పిలుపు వినిపిస్తూంటుంది.
సందేహం లేదు, నీవు మృత్యు పదఘట్టనలని
దాని దుస్తుల రెపరెపల్నీ, ఒక వృక్షంలా మౌనంగా వినగలవు.

మృత్యువు మాయా తివాచీపై కూర్చొని
నేలను నాకుతూ, మృతులకై వెతుకుతూ
భూమిని చుడుతూ ఉంటుంది.
మాయా తివాచీయే మృత్యువు.
దాని మృత్యు నాలిక మృతులను వెతుకుతూంటుంది.
తివాచీ నేసుకోవటానికి దారాలను వెతుక్కొంటూంది.

నాకు తెలియదు
నాకు కొంచెమే అర్ధమయింది
దృశ్యం అస్పష్టంగానే ఉంది, కానీ
మృత్యు గీతం అనేది తడిచిన నల్లకలువల వర్ణమని
నేను నమ్ముతున్నాను.
అవును
మట్టికి అలవాటు పడిన నల్లకలువ వర్ణమే!
ఎందుకంటే
మృత్యువు యొక్క ముఖం ఆకుపచ్చన.
ఎందుకంటే
నల్లకలువ దళపు పదునైన తడితోనూ
దాని గంభీరవర్ణపు శీతాకాల అసహనంతోనూ సారించే మృత్యువు యొక్క తీక్షణ చూపులు ఆకుపచ్చనే మరి.

మంచాలపై మృత్యువుంది
మెత్తని పరుపులపై, నల్లని దుప్పట్లలోనూ ఉంది.
దుస్తుల మడతలలో మృత్యువు విస్తరించి

అకస్మాత్తుగా పేలుతుంది.
దుప్పట్ల మధ్య నల్లటి శబ్దం వ్యాపిస్తుంది.
మంచాలు ఓడరేవుకై ప్రయాణం సాగిస్తూంటాయి.

అక్కడ
యుద్ధఓడల అధిపతి దుస్తులు ధరించిన
మృత్యువు ఎదురుచూస్తుంటుంది.

Only Death by Pablo Neruda

## ఓ కవితకు వీడ్కోలు – by Luo Fu



ముప్పై ఏళ్ళుగా
భద్రంగా దాచుకొన్న
ఒకనాటి నా ప్రేమ కవితను
నిప్పులకు అప్పగించాను.

ఎగిసిన జ్వాలల మధ్య
పదాలు భోరు భోరున
విలపించాయి.
బూడిద మాత్రం
ప్రశాంతంగా ఉంది
ఎందుకంటే
ఏదో ఒక రోజున నా ప్రేయసి
గాలి మీద నా వాక్యాల్ని
చదువుకొంటుందని
నమ్మకం దానికి.

Luo Fu – (translated into English by John Balcom)

## poem by Poonam Bhatia

రెండే రెండు వాక్యాలలో గొప్ప అర్థాన్ని పొదువుకొన్న కవిత ఇది. నిజమే కదా, రెక్కలు ఒక్కటీ ఉన్నంత మాత్రాన ఎగురుతామన్న భరోసా ఉండదు. ప్రయత్నం చేయాలి, శక్తిని కరిగించాలి. simple yet so deep .

ఎగరాలంటే
రెక్కలొక్కటే సరిపోవు....
గగనపు హృదయంలో
స్థానం సంపాదించటం కోసం
పిచ్చుక తన ఎముకల సారాన్ని
సమర్పించుకొంటుంది.

by Poonam Bhatia

## Disha Sahoo Poem

పదహారేళ్ళక్రితం
ఇంటినుంచి పారిపోయిన అమ్మాయి
తన పిల్లలతో పుట్టింటికి వచ్చినపుడు
తన గది అలాగే ఉండటాన్ని చూసి ఏడవలేదట
పెట్టెనిండా ఒకప్పుడు తను వాడిన గోళ్ళ రంగు సీసాలను
చూసుకొని ఏడ్చిందట
పగుళ్ళుతీసిన తన గోళ్ళను తలచుకొంటూ.

Disha Sahoo

దిషా సాహూ వ్రాసిన ఈ కవితలో ఏముంది ?
పారిపోయిన అమ్మాయికి కలిగిన కష్టాలగురించి చెపుతుందా లేక మిడిల్ ఏజ్ లో వచ్చే దైహిక మార్పులను సూచిస్తుందా?
కూతురు వెళిపోయినా ఎప్పటికైనా తను వస్తుందని ఎదురుచూస్తూ, ఆమె గదిని అలానే ఉంచిన తల్లితండ్రుల పిచ్చి ప్రేమ గురించి చెపుతుందా?
ఏమో తెలీదు కానీ ఎందుకో చదవగానే హాంట్ చేస్తుంది. జీవితం గరుకు గరుకుగా తగులుతోంది ఈ కవితలో.

## ఒకప్పుడు ONCE" -- by Sarim Rizvi

ప్రతీ రోజూ
ఓ పక్షుల గుంపు
మా డాబాపైకి వచ్చి వాలుతుంది
వాటిలో కొన్ని ఒక్కోసారి
ఇంటి గోడను గుద్దుకుంటాయి కూడా

ఒకప్పుడు
ఇక్కడో చెట్టు ఉండేదేమో బహుసా
ఇప్పటి కాంక్రీటు గోడలకు బదులుగా

Source: Sarim Rizvi

Habitat Destruction గురించి చెప్పే కవితలు ఎన్నో ఉండవచ్చు. కానీ ఈ కవితలా అందంగా, క్లుప్తంగా, పదునుగా వ్యక్తీకరించటం మనం అరుదుగా చూస్తాం. కొన్ని పక్షులు ఇంటిగోడను గుద్దుకొంటాయి అనటం ద్వారా విధ్వంసం యొక్క వికృతత్వం, ఇతరజీవరాశులు ఎదుర్కొంటున్న నిస్సహాయత అద్భుతంగా ఆవిష్కృతమైంది.

## Tightrope Dancer  by Vatsyayan 'Agyeya'




బిగించి కట్టిన తాడు
దానిపై నా ఆట. ఆ బిగుతు తాడు.
రెండు కర్రలకు బిగించి కట్టిన ఆ సన్నని తాడుపై నా ఆట
తాడుపై నా ఆటేమిటంటే
ఈ కర్రనుంచి ఆ కర్ర వరకూ ఆడటమే.
రెండు కర్రలకూ బిగుతుగా కట్టిన
నేనాడే ఆ తాడుపై పడే ఫ్లడ్ లైట్ల కాంతిలో
జనాలు చూస్తూంటారు
ఆడే నన్ను కాదు
నే నిలుచున్న తాడును కాదు
తాడు కట్టబడ్డ కర్రలను కాదు
నా ఆటను చూపించే కాంతినీ కాదు
జనాలు ఆటను మాత్రమే చూస్తూంటారు.

కానీ
నేనాడే ఆట
నేను ఆట ఆడే తాడు
తాడును బిగించి కట్టిన కర్రలు
అన్నిటినీ చూపించే ఫ్లడ్ లైట్ల కాంతి
ఆ కాంతిలో
కర్రల మధ్య బిగించి కట్టబడ్డ ఆ తాడుపై
నిజానికి నేను ఆటాడటం లేదు.
తాడు ముడిని ఒదులు ఎలా చేయాలా అని
ఈ కర్ర నుండి ఆ కర్రకు నేను తిరుగుతున్నాను.
దాని పట్టు సడలించటానికి గింజుకొంటున్నాను
పారిపోదామని.
పట్టు సడలటం లేదు
రెండు కర్రల మధ్యా
అలా తిరుగుతూనే ఉన్నాను
ఏ మార్పూ లేదు.

కానీ దాన్నే ఆటగా భ్రమించి చూస్తున్నారు జనాలు
తాడును కాదు
కర్రలను కాదు
కాంతిని కాదు
తాడు బిగింపునూ కాదు
వాళ్లు
ఆటను మాత్రమే చూస్తున్నారు.

Vatsyayan 'Agyeya'

## అంతే ....by P.P. Ramachandran



ఒక చిన్న తీయని కూత చాలు
తనిక్కడ ఉంటున్నానని చెప్పటానికి
ఒక రాలిన ఈక
తనిక్కడ ఉండినట్లు చెపుతుంది.

మట్టిలోని వెచ్చదనం
తనిక్కడ ఉంటుందని చెపుతుంది.

ఎంత సింపుల్ గా జీవితాలని
గానం చేయ గలుగుతున్నాయీ – పక్షులు.

THE SIMPLE P.P. Ramachandran FRIDAY, MARCH 19, 2010

## వారిలో ఒకరు. (ONE OF THEM)– by P.P. Ramachandran

వారిలో ఒకరు
స్కూలు బస్ స్టాప్ వద్ద అమ్మాయిలు
బస్సుకోసం ఎదురుచూస్తున్నారు

ఎంత ప్రయత్నించినా
వలికే దేహ సౌందర్యాన్ని
గొడుగులు, బ్యాగులు, జోళ్లు, యూనిఫార్మ్ లు
నిలువరించలేక పోతున్నాయి.
బయటకురికే వారి హృదయాలను
వారి మాటలు, చూపులు, భంగిమలూ
ఏ మాత్రం దాచలేక పోతున్నాయి.
కళ్ళముందే బస్సులు దాటిపోతూంటే
ఆందోళన పెరుగుతూంటుంది.
★★★
వారిలో ఒకామె ప్రభుత్వాధికారి
మరొకామె ఓ గృహిణి అవుతారు
ఇంకొకామె దారి తప్పుతుంది.....
ఆ స్కూలు పక్కనుంచి సాగే బస్సులో
ఒళ్లో పిల్లాడ్ని పెట్టుకొని కూర్చున్న ఆమె తన భర్తతో
"ఈ స్కూల్లోనే నేను చదువుకొన్నది" అంటోంది.

అక్కడ ఇంకా ఒకరు బస్సుకోసం
ఎదురుచూస్తూనే ఉంటారు
ఇప్పటికీ!

Source: ONE OF THEM -- P.P. Ramachandran (JULY 21, 2010)

# Short poem by Miroslav Holub



తరగతిగది తలుపు సందులోంచి
సన్నని ధారగా రక్తం కారుతోంది
ఎందుకంటే
అమాయకుల ఊచకోత
అక్కడనుంచే మొదలవుతుంది.
----Miroslav Holub

# క్లైమితో వీధిలోని అపార్ట్ మెంట్ కొరకు రెండు వైరుధ్య గీతాలు



వంశపారంపర్య ఆస్థులలో స్త్రీల వాటాకొరకు న్యాయపోరాటాలు జరగటం నేడు చాలా సహజమైన విషయంగా మారిపోయింది. ఇందులో న్యాయాన్యాయాల విషయం పక్కన పెడితే పెళుసుగా మారుతున్న మానవసంబంధాల అంశం గమనించదగ్గది.
ఈ కోణాన్ని స్పృశిస్తూ Karla Comanda వ్రాసిన ఈ కవిత నన్నెంతగానో ఆకట్టుకొంది. కవిత చివరి వాక్యం నన్ను ఆశ్చర్యపరచలేదు. ఎందుకంటే అదొక వాస్తవ స్థితిని చెపుతుందనే భావిస్తున్నాను.

జీవితంలోని సాధారణ సంఘటనలను తీసుకొని వ్రాసే కవిత్వానికి నేడు ప్రపంచవ్యాప్తంగా మంచి గుర్తింపు లభిస్తుంది. అలా రాయటం కత్తిమీద సాము లాంటిది. ఏమాత్రం లోతు, విస్తృతి లేకపోయినా విఫలమౌతుంది. కానీ ఈ కవితలో పుట్టి పెరిగిన ఇంటిపై మమకారం, తన తండ్రి రక్తాన్ని/గౌరవాన్ని నిలిపానన్న గర్వం, సొంత మేనత్తను ఒదులుకొన్న వైనం చాలా సూటిగా ప్రతిబింబించి కవితను ఒక ఉద్వేగ భరిత అనుభవంగా చేసాయి.

Karla Comanda ఫిలిప్పైన్స్ కు చెందిన కవయిత్రి. కొలంబియా యూనివర్సిటీలో క్రియేటివ్ రైటింగ్ పై మాస్టర్స్ డిగ్రీ చేస్తున్నారు.

★★★

.

**క్లైమితో వీధిలోని అపార్ట్ మెంట్ కొరకు రెండు వైరుధ్య గీతాలు** -- Two Anti-Ghazals for the Apartment on Kaimito Street by Karla Comanda

I

పదహారేళ్ల తరువాత కూడా ఆ గోడలపై క్రేయాన్ రాతలు ఇంకా ఉన్నాయి
రంగులు వెలిసిపోతూ, లోపలి పొరల్ని బయటపెడుతూ.
చెక్కబీరువా ఒక కలరాఉండల మడుగు
మూలమూలల్లో ఇంకా చిక్కుకొనే ఉన్న వాసన
నా చిన్నతనం నాటి ధూళిని పొరలు పొరలుగా పేర్చుకొంటూన్న
మా నాన్న కంప్యూటర్ దుమ్ముపట్టి ఉంది.
చార్లీ బ్రౌన్ విజ్ఞానసర్వస్వం పుటలు ఇప్పటికీ చిరిగిపోయే ఉన్నాయి
నా కుటుంబంలా, మా నాన్న కుటుంబంలా

భార్య, పిల్లలను తిట్టిపోస్తున్న అతని సోదరి మాటలను వినీ వినీ
అరిగిపోయిన కుళాయి నుండి ఏదో కిర్రుమన్న ధ్వని

II

పరస్పరం ఇచ్చిపుచ్చుకొంటున్న సంతకాలపై
ఫ్లోరెసెంట్ కాంతుల నీడలు పడుతున్నాయి
మా నాన్న సోదరి అడ్డంగా ఉండి
దురదృష్టము, నిరాదరణ నిండిన చూపులను మాపై కురిపిస్తూంది.
"ఆయనకు కూతురువైనంత మాత్రాన ఏదీ యాంత్రికంగా నీకు రాదు"
అంటూ ఆమె లాయరు మంత్ర పఠనం చేస్తున్నాడు
బయట కారు శబ్దాలు, సంభాషణలు నేను ఉన్నానని,
రక్త సంబంధం కోర్టువ్యవహారాలకన్నా చిక్కనైనదనీ గుర్తుచేస్తున్నాయి
నేను భరించలేని వెలకు వాళ్ల హక్కులను అమ్ముకుపోయారు
అయినా సరే వాళ్ళ నాశనం కొరకు నేను ఎదురుచూస్తూనే ఉంటాను.

## Tomas Transtromer, Sentimental Notes



జీవితం మధ్యలో ఎపుడో మృత్యువు వచ్చి నీ కొలతలు తీసుకొంటుంది. ఆ విషయం మర్చిపోతావు, జీవితం సాగిపోతూంటుంది. కానీ రహస్యంగా దుస్తులు కుట్టబడుతూ ఉంటాయి --- Tomas Transtromer, Sentimental Notes

## నిశ్శబ్ద ప్రపంచం ---by Jeffrey McDaniel



ఒకరికళ్లలోకి మరొకరు మరింత ఎక్కువసేపు
చూసుకొంటూ ఉండటానికి
ఇంకా మూగవాళ్లను సంతృప్తి పరచటానికి
ప్రభుత్వం ప్రతి ఒక్కరికీ రోజుకి సరిగ్గా
నూట అరవై ఏడు పదాలను మాత్రమే
కేటాయించాలని నిర్ణయం తీసుకొంది.

ఫోన్ మ్రోగినప్పుడు ఎత్తి హలో చెప్పకుండా
చెవిదగ్గరపెట్టుకొంటాను
రెస్టారెంటులో చికెన్ సూపును వేలుతో చూపిస్తాను.
ఈ కొత్త విధానానికి కొద్దికొద్దిగా అలవాటు పడుతున్నాను.

బాగా రాత్రయ్యాకా నా సుదూర ప్రేయసికి ఫోన్ చేసి
"నేనీ రోజు యాభై తొమ్మిది పదాలు మాత్రమే వాడాను
మిగిలినవి నీ కొరకు దాచి ఉంచాను" అంటాను.
ఆమె స్పందించకపోతే
తన పదాలన్నీ ఖర్చయిపోయాయని అర్ధమౌతుంది

నెమ్మదిగా లోస్వరంతో "I Love You" అంటాను
ముప్పై రెండో సారి.
తరువాత అలా కూర్చొని ఒకరి శ్వాసను మరొకరు
అలా వింటూ ఉండిపోతాం.

The Quiet World by Jeffrey McDaniel

## ఈ ప్రపంచం ...'This World' by Czeslaw Milosz



బహుసా ఇదంతా
ఒక అపార్థంలా అనిపిస్తోంది
ట్రయల్ రన్ ను అందరూ నిజమనుకొన్నారు

నదులు ఇక తమ మూలాలకు వెళిపోతాయి
గాలులు సుడులు తిరగటం ఆపేస్తాయి
చెట్లు చిగురించటం బదులు వ్రేళ్ళలోకి దూరిపోతాయి
వృద్ధులు బంతివెనుక, అద్దం వెనుకా పడతారు
మరలా వారు చిన్నపిల్లలైపోతారు
మృతులు లేచి దిక్కులు చూస్తుంటారు
ఇంతవరకూ సంభవించినదంతా అసంభవిస్తుంది

పంటిబిగువున బాధను సహిస్తున్న వాడా
ఎంత ఉపశమనం!
ఇక ఊపిరి పీల్చుకో!

'This World' by Czeslaw Milosz

## పతంగుల రుతువు - by Eunice de Souza



చెట్లకు తోరణాల్లా వేలాడుతున్నాయి
రంగురంగుల పతంగులు
చెట్లకు తోరణాల్లా వేలాడుతున్నాయి
పక్షులు
గాజురజను పూసిన దారానికి
రెక్కో కాలో చిక్కుకొని

"Kites Season" by Eunice de souza

## నా పదిహేనో ఏట యుద్ధానికి వెళ్లాను

నా పదిహేనో ఏట యుద్ధానికి వెళ్లాను
ఇప్పుడు నా వయసు ఎనభై
చివరకు ఇంటికి వచ్చాను
మా వూరి మిత్రుడ్ని అడిగాను
'మా ఇంట్లో ఇప్పుడెవరు ఉంటున్నారని'
నీ ఇల్లు అక్కడ ఉంది' అన్నాడతను.

అక్కడ
మట్టి దిబ్బలనిండా తుమ్మలు, తుప్పలు.
పందికొక్కులు తిరుగుతున్నాయి
సరంబిల మధ్య కాకులు గెంతుతున్నాయి
పెరటినిండా వరిమొక్కల గుబుర్లు
నూతి చుట్టూ పొద్దుతిరుగుడు మొక్కలు
గింజల్ని రాల్చి గంజి కాసాను
పొద్దుతిరుగుడు పువ్వులతో చారు పెట్టాను

తినమని వడ్డిద్దామంటే ఒక్కరూ లేరు
తూర్పు తలుపు వైపు వెళ్ళి
అలా చూస్తూ నిలుచుండిపోయాను
కన్నీళ్ళు నా దుస్తుల్ని తడుపుతున్నాయి.

ANONYMOUS CHINESE FOLK SONGS – 120 BCE

క్రీస్తు పూర్వం 120 సం.లో హన్ డైనాస్టీ కాలంలో Yuefu ( Bureau of Music) అనే ప్రభుత్వ సంస్థ సేకరించిన జానపదగీతం ఇది. (కాస్త అటూ ఇటూగా అదేకాలంలో హాలుడు సేకరించిన సప్తశతి గాథలు గుర్తుకు వస్తున్నాయి)
ఈ గీతంలో లాగే మనంకూడా- ప్రొడక్టివ్ ఇయర్స్ లో బిజీగా మారిపోయి కుటుంబంతో జీవనమాధుర్యాలను ఆనందించక, చివరకు పంచుకోవటానికి ఒక్క వ్యక్తికూడా మిగలని ఏకాంతంలోకి వెళిపోతున్నాము అనిపించక మానదు.
రెండువేల నూట నలభై సంవత్సరాల క్రితం వెలిబుచ్చిన ఒక మానవానుభూతి ఎంత అద్భుతంగా నేటికీ వర్తిస్తోందో ఆలోచిస్తే ఆశ్చర్యం వేస్తోంది.

## పక్కింటి తలుపు – Neighbour's Door by Virgilio Piñera



మా పక్కింటి తలుపుపై
ఒక వణికించే నోట్
"నేను శోకిస్తున్నాను
నన్నువెవరూ ఓదార్చలేరు వెళ్ళిపొండి"

రాత్రి ఓ కల వచ్చింది
కలలో ఆ తలుపు తెరిచాను
అక్కడ శోకిస్తున్నది నేనే
కన్నీళ్లతో తడుస్తున్నది
నా మొఖమే

మూలం: Neighbour's Door by Virgilio Piñera

## నిన్ను ప్రేమించేందుకే వచ్చాను నేను



నిన్ను గాయపరచటానికి కాదు
గతం నీ హృదయంలో మిగిల్చిన
గాయాలకు కట్టుకట్టటానికే వచ్చాను నేను

కానీ నన్ను నీవు అనుమతించటం లేదు
మరలా మరోసారి పగిలిముక్కలవుతానా అని
భయపడుతున్నావు
నేను అతనిలా కాదు
నేను వారిలా కాదు
నువ్వు అర్థం చేసుకోవాలని
ఆశిస్తున్నాను అర్థిస్తున్నాను

నీచుట్టూ ఎత్తైన గోడను నిర్మించుకొన్నావు
నాకు తెలుసు నాకు తెలుసు
దాన్ని దాటడం కష్టమని
కానీ ఖచ్చితంగా ప్రయత్నిస్తాను
నువ్వు తలుపుతెరచి
నీ హృదయంలోకి ఆహ్వానించేవరకూ
నేను నిరీక్షిస్తాను.

మునుపెన్నడూ లేని విధంగా
నిన్ను ప్రేమించనీ నన్ను!

మూలం: "I'M HERE TO LOVE YOU" by Tone Butta The Poet

## వారికొరకు అన్వేషణ – Insearch of Some Jeyaraj Daniel

మనిషి సృష్టించిన
ఈ మహా ఎడారిలో
ఎక్కడో ఒకచోట
రవంత జీవజలం
ఉండకపోదు

కనుచూపు మేరంతా
పరుచుకొన్న శూన్యం వెనుక
ఎక్కడో ఒక చోట
చిగురంత పచ్చదనం
ఉండకపోదు

ఈ మృగతృష్ణను
శమింపచేసేదేదో
ఎక్కడో ఒకచోట
మనకొరకు ఎదురుచూస్తూ
ఉండకపోదు

జనన మరణాలను
సంరక్షించే ఏ కొద్దిమందో
ఈ భూమండలంపై
ఎక్కడో ఒకచోట
ఉండకపోరు
వారికొరకే నా అన్వేషణ

మూలం: Insearch of Some Jeyaraj Daniel (Principal, Dr.SRK Degree College, Yanam)

## నువ్వు, నేను, ఈ జగత్తూ by Werner Aspenström

.

నువ్వంటే ఎవరు , నేనంటే ఎవరు
ఎందుకు ఇది ఇలా ఉంది అని అడగొద్దు.
అదంతా పండితుల పని
వాళ్ళు చూసుకొంటారు.

కిచన్ టేబుల్ పై తక్కెడ ఉంచు
వాస్తవం తనని తాను తూచుకొంటుంది.

చొక్కా తొడుక్కో.
హాల్ లో లైట్ ఆర్పివేయి
తలుపు మూసేయి.
శవాలను శవాలు భద్రపరచనీ.
మనం అలా తిరిగొద్దాం

తెల్ల రబ్బరు బూట్లు వేసుకొన్న మనిషివి
నీవు
నల్ల రబ్బరు బూట్లు వేసుకొన్న మనిషిని
నేను
మన ఇద్దరిమీద పడుతున్న వాన
వాన

Source: You and I and the World by Werner Aspenström (1918–1997)

## "On Making Tea" by Rohith



ఇస్మాయిల్ గారు ఓ కవితలో తేనీరు సమయంగురించి చెపుతారు. ఒక మామూలు అనుభవాన్ని కవిత్వంలోకి తెచ్చేపద్ధతికి అదొక చక్కని ఉదాహరణ. చాన్నాళ్లకు మరలా టీ గురించి చదివిన గొప్ప కవిత ఇది.

Rohith అచ్చమైన తెలుగబ్బాయి. ఇంగ్లీషులో కవిత్వం రాస్తారు. పలు జాతీయ, అంతర్జాతీయ పత్రికలలో ప్రచురింపబడ్డాయి ఇతని కవితలు. వొలుచుకొన్న కొలదీ పొరలు పొరలుగా విచ్చుకొంటూ చివరకు వచ్చేసరికి ఒక గాఢ జీవనపరిమళంమేదో గుండెల్ని కుదిపేస్తుంది. Life goes on for every one. For a poet it is like a rebirth at each move. This poem captures such moment brilliantly.

★★★

**టీ కాచుకోవటం గురించి**

మొదట్లో మా నాయినమ్మ  
టీ తో నన్ను నిద్రలేపేది  
అది ప్రతీసారి ఒకే రుచిని కలిగి ఉండేది  
తూకమేసినట్లు తియ్యదనం  
పాలు.

ఒకరోజు, ఆమె గతించాక  
ఈ ప్రపంచంతో అంగీకారానికి వచ్చేక్రమంలో  
దుఃఖం టీ రుచిలా అనిపించేది:

ఆ రుచిని మరచిపోదామని ప్రయత్నించేవాడిని  
కానీ టీ తాగిన ప్రతీసారి– ఒక పరాయితనాన్ని  
రుచి చూస్తున్నట్లు ఉండేది, అది నేరుగా నన్ను  
మా నాయినమ్మ వద్దకు తీసుకొనిపోయేది.  
ఆ పరాయితనం నాలో క్రమక్రమంగా పెరుగుతూ వచ్చింది  
అది నాకొక కొత్త చర్మాన్ని ఇచ్చింది. వేరే పొర.  
మెల్లమెల్లగా నేను టీ తయారుచేసుకోవటం  
నేర్చుకొన్నాను.  
ఖచ్చితమైన పాళ్లలో... నా సొంత టీ.

Source: On Making Tea by Rohith

## Poem by Rohith

ఒక స్థాయి దాటిపోయాకా
మాటలన్నీ అప్రస్తుతమై మిగులుతాయి
ఊరు విడిచిన మిత్రులు
ప్రతిధ్వనులుగా మాత్రమే తిరిగొస్తారు

బ్రతికుండటం అంటే
ఇంకా చనిపోకుండా ఉండటం మాత్రమే కాదు
బ్రతికుండటం అంటే ఆకులు నేలరాలటం
చెట్లు హింసను మూగగా ఓర్చుకోవటం
ఉదయాన్నే పక్షులు గానాన్ని కొనసాగించడం

ఎవరినైనా ఇష్టపడటం ఇపుడు
వారు వెళ్లిపోయేటపుడు వీడ్కోలు చెప్పలేకపోవటం
ఒక ఖాళీ అయిన చోటు ఎన్నటికీ
మునుపటిలా ఉండకపోవటం
దుఃఖించటం అంటే
నిశ్శబ్దహృదయం చేసే సుదూర రోదనలను
చెవులురిక్కించి వినటం

చివరకు
ఇదంతా కలలు రాని నిద్ర
ఒక ఖాళీ శవపేటిక

23 April, 2021

## poem by Rohith

మనం రాయని కవితలు
మనతో పాటు మరణిస్తాయని
అనుకొంటాం.
అవి మన తరువాత కూడా
బ్రతికే ఉంటాయని మనకు తెలియదు.
శూన్య దేవాలయపు విగ్రహాల
అనంత నిశ్శబ్దంలా
మనం రాయని కవితలు
తమదైన సౌందర్యంతో
చరిత్రలకూ, చూసేవాళ్ళకూ ఆవల
జీవిస్తూంటాయి

రాయనందుకు సంతోషిస్తూ

## రోహిత్ కవిత – Poem by Rohith

ఆ పాతగదిలో నువ్వు దాటుకు వచ్చేసిన పుస్తకాల నిధి దొరుకుతుంది
ఆ పాత ఇంటిలో నువు కోల్పోయిన బంధువుల పేర్ల వాసన తెలుస్తూంటుంది
ఆ పాత మిత్రుడు విస్మృత వృక్షాల గురించి మాట్లాడుతాడు
ఆ పాత చొక్కా టైమ్ మెషిన్ గా మారి నిన్నో ఫొటో ఫ్రేములో బిగిస్తుంది
ఆ పాత ప్రియురాలు ఇంకా ఓ గాఢ నిశ్శబ్దంతో నీతో మాట్లాడుతుంది
ఆ పాత పుస్తకంలో ఇప్పటిదాకా నువ్వేం కోల్పోయావో దొరుకుతుంది
నిలుపుకోలేక పోయిన స్నేహితునికి నీ పుట్టినరోజు తెలుసు
ఈ పాతపరిమళం నేడు నువ్వు కోరుకొంటూన్న అన్నిపరిమళాలకు మూలం
పడిపోయిన తాళంచెవి మాత్రమే అత్తరు ఉత్తరాలున్న ట్రంకుపెట్టె తెరవగలదు
గడచిన క్షణమే నువ్వు జీవితం గురించి నాకేమీ తెలియదని తెలుసుకొంటావు
పాత జీవితమంతా గతక్షణం ఏం జరిగిందో తెలియకపోవటం
ఓ పాతకిటికీ నువ్వు కుర్రతనంలో గాయపడ్డ మైదానంలోకి తెరుచుకొంటుంది
పాతఫోనులో ఒకనాటి ప్రేమికుల ఆత్మలు సంచరిస్తూంటాయి
పాత పిల్లి వెళ్ళిపోయాక తెలుస్తుంది నువ్వు ఒంటరివైనావని
పాత సంచిలో నీగురించి నీకు తెలియని దాన్నేదో నువ్వు కనుగొంటావు.

## చుంబనాలు, రతికేళి, పాతపుస్తకాలు గురించి - by Ro Hith

1.
రత్యనంతరం నేనన్నానూ
“నీ దేహమొక టైమ్ మెషినై నన్ను
అనాది నేలకు తీసుకెళుతుంది
అక్కడ
ఓ ఆదిమానవుడు
రెండు రాళ్లను ఆడిస్తూ
నిప్పును రాజేస్తాడు” అని
2.
శృంగారం మరలా తిరగబెట్టేలోపు
ఓ పాత పుస్తకాల షాపుకి వెళ్ళాం
ఏదో సాకు కల్పించుకొని
నా దేహం యావత్తూ చుంబిస్తూ
నువ్వన్నావూ
“ఈ ప్రదేశం నీ నోటి వాసన వేస్తోంది” అని
3.
ముద్దు మద్యలో ఊపిరితీసుకొంటూ నువ్వన్నావు
“నీ శ్వాస వాసన వేస్తోంది
ఆ పాత పుస్తకాల షాపు వాసన లాంటిదే
కానీ
విధ్వంశం తరువాత నాశనమైన నగరంలా ఉండే
నీ మొఖం ఈ గెడ్డం అంటే నాకెంతో ఇష్టం” అని
నేను నిట్టూర్చాను
కడలి గర్భంలోకి కూలిపోయిన
నగరాల గురించి ఆలోచిస్తూ
ఖాళీ అయిన ఊర్లని ముంచెత్తిన
అకాల వరదల్ని తలచుకొంటూ

about kisses, sex and second-hand books by Sri. RO HITH

## అనంతాన్ని కల్పన చేసిన మానవుని వృత్తాంతము by Rohith

అన్ని విషయాలు తెలిసిన అతను
అనంతం గురించి కల్పన చేయటం
మొదలెట్టాడు ఇంటికి వెళుతూ వెళుతూ.

నక్షత్రాల వెలుగులో
అనేక మలుపుల్లో ఎడమవైపు తిరిగి
ఇల్లుచేరే దారి తప్పాడు.

అనంతం గురించి గాఢాలోచన చేస్తూ
తన పేరు తాను మరచిపోయానని గుర్తించాడు
ఇంటిని, పేరుని మరచిపోయిన అతను
అలా నడుస్తూనే ఉన్నాడు
అనంతం గురించి చింతన చేస్తూ.
అతను తాను మానవుడినన్న వాస్తవాన్ని
అనుకోని క్షణాలలో పరిత్యజించాడు.
ఎక్కడకు వెనుదిరగాలో, ఎక్కడకు వెళుతున్నాడో
చెప్పేవారు లేక, అతను అలా అలా ముందుకే సాగిపోయాడు అనంతం గురించి ఆలోచిస్తూ.

ఈ ప్రయాణంలో ఒక దశలో తనకు
ఒక అస్తిత్వం ఉందనే సత్యాన్ని కూడా వదిలివేసాడు.
ఇంటికి బయలుదేరిన అతని వద్ద
ఇపుడు శూన్యం మాత్రమే మిగిలింది.
అతను తన ఆలోచనలలో చాలా దూరం సాగిపోయాడు
వెనక్కు తిరిగిరాలేనంతగా.

అతను అనంతం గురించే ఆలోచిస్తూ
చివరకు అనంతం గురించి కూడా మరచిపోయి
శూన్యంలో లీనమయ్యాడని వృత్తాంతం చెబుతోంది.

For Hawking – The Legend of the man who imagined the Infinite by RO HITH

## వేసవి అర్ధరాత్రి by Rohith

ఖాళీతనపు భారంతో దొర్లుతూంది వీల్ చైర్
రైల్వే స్టేషన్ రద్దీలో ఎవరో అనామకుడు చనిపోతాడు
వచ్చీపోతూంటారు ప్రయాణీకులు
నిద్ర మెల్లమెల్లగా నగరంలోకి ప్రవేశిస్తుంది
ఖాళీవీధులలోకి గాలులను ఊదుతున్న చలి
చేతితొడుగులోకి దూరుతోన్న వేళ్ళు;
సిరంజి పిస్టన్ వెనుకకు లాగబడింది.
నిన్నటి రక్తపు దుప్పట్లు ఉతకబడ్డాయి
నేడు ఎవరికీ గుర్తులేవు.
ఎండాకాలపు స్వప్న హింసలో
సుదూర రహదారి వాహనాల జబ్బు సంగీతం
ముసలి ముష్టివాని బలహీన నాడీస్పందన-
జీవితం కన్నా పదునైన గొంతుకలు

Summer Midnight by Ro Hith

This is the comment I made in his wall "Ext-ordinary poem. Melancholy frozen in words sir"

## విద్రోహి కోసం --- by RO HITH

నీ కవితను నేను చూసాను
నోట్లో బీడీతో
రింగు రింగుల పొగనొదుల్తూ
మెడకు రుమాలు చుట్టుకొని
పాత కోటు, చిరుగుల పంట్లాం తొడుక్కొన్న కవితను.
చూడగానే పోల్చుకొన్నాను
అది నీ కవితేనని

కాలమనే రాజవీధిని
దాటటానికి యత్నిస్తోంది నీకవిత అప్పుడు
బార్ల నుంచి ఇంటికి వెళ్ళే కుర్రవిద్యార్థులు
కక్కుకొన్న రాజవీధి అది
విప్లవకారుల్ని దయలేని వాహనాలు
ఢీకొట్టిన రాజవీధి అది
మతిమరుపుని అనాదిగా
భరిస్తున్న రాజవీధి అది
ఒక కవిని అతని కవిత్వాన్ని ఏనాడూ
పట్టించుకోని రాజవీధి అది

విద్రోహీ
'నన్ను అవతలి వైపుకు దాటిస్తావా' అని
నీ కవితను అడగటానికి సిగ్గేసింది
నా బీడీ వెలిగించుకోవటానికి
నిప్పు అడిగాను.

For revolutionary poet Vidrohi, of JNU – 13, December 2016